# ఆగర్భశూరులు.



[కరుణ రసపూరితమగు శోక పద్య ప్రబంధము]

ఇయ్యది

“మణిమాలా” ద్యనేక గ్రంథ కర్తలగు

యల్లాప్రంతుల - జగన్నాథం బి. ఏ. గారిచే

రచింపఁబడి ప్రకటింపఁబడినది.

మొదటి కూర్పు 500 ప్రతులు.

చెన్నపురి:

శ్రీ వైజయంతీ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1915.

ఈ పద్య ప్రబంధమును

సంస్కృతాంధ్ర హూణవిద్యా పారంగతులును,

అప్రతిమాన ప్రతిభాసంకలితులును, సంతత ధర్మ నిరతులును,

శ్రీ హిందూ రాజ్య ప్రభుత్వ ప్రసాదితా నితర దుర్లభ్య

"రావ్ బహదూర్" సద్గౌరవ బిరుదాలంకృతులును,

శ్రీ విజయనగర స్థిత "మహారాజాస్ కాలేజి" 'ప్రిన్సిపాల్'

నామకాత్యున్నత పదవీ విరాజితులును,

అతివినీతి యుతులును,

అస్మద్గురు వరులును,

అగు

శ్రీయుత

రావ్ బహదూర్ కిడాంబి. రామానుజాచార్యులు ఎమ్. ఏ. బి. యల్.,

గారికి

కృతి యొసంగి నాడను.

య. జ.

# పీఠిక.

గీర్వాణ భాషా పరిశ్రమము నొనరించి జన్మసాఫల్యము నొందుటకు నే నెంత కుతూహల పడుచున్నను దీక్షిత లేమియు, నుద్యోగపరతయు నా కట్టిభాగ్యము నేఁటి వఱకు లభింపఁజేయమిచే నాంధ్రభాషయెడ నాకుఁగల యత్యంతాభిమానముఁబట్టి తద్భాషా సేవనైన నప్పుడప్పుడు చేసెడి తలంపుతో నే నొనర్చెడి జతనములలో నిది యొకటి స్వభాషా సేవయే ముఖ్యోద్దేశము కావునఁ బద్యరచనకై నా సమర్థత ననుసరించి సుప్రసిద్ధాంగ్లేయ కవీశ్వరులు రచించిన పద్యప్రబంధములలోఁ దలమానికములగు కొన్నిఁటిని భాషాంతరీకరణ మొనర్ప నెంచినాఁడను. అట్టి నా ప్రయత్నములలో నిది రెండవదియే. ఇయ్యది "మ్యాచూ ఆర్నోల్డ్" (Matthew Arnold) అను నొక విఖ్యాత కవిచే విరచింపఁబడిన "సొహ్రాబ్ అండ్ రుస్తుమ్" (Sohrab & Rustum) అను పేరఁ బరగు నొక ప్రబంధ రాజమున కాంధ్రీకరణము. ఇందలి కథ "షానామా" (రాజుల పుస్తకము) అను నొక పారసీక దేశపు వీరపురుషేతిహాసము.

భాషాంతరీకరణమన్న నాకుఁజాల యభిమానము. ఇందులకుఁ గారణ మాంధ్రప్రపంచమునఁ జిరజీవితమ్ములును, స్వకపోల కల్పితములును నగు కృతుల నిర్మించుటకు నాకుఁ బ్రతిభ లేమియే. ఆంధ్ర మహాభారతాద్యుత్తమ గ్రంథములు పఠించిన నాంధ్రభాషయందు సాహిత్యము కుదిరినను బ్రతిభ లేక గ్రంథరచనకు మొదలిడినచోఁ బెక్కుకవులచేఁ బ్రయోగింపఁబడి యిప్పుడు చర్వితచర్వణములైన యుపమానములే శరణమగుటయు, నొకవేళ స్వకపోల కల్పనమ్ములకు సాహసించినచో హాస్యాస్పదములగు కృతులు నిర్మితమగుటయు, దటస్థము కాఁగలదని వెఱచి యాంధ్రేతరభాషలయందుఁ బరిచితి యుండి నపుడా యా భాషలలోఁ గవిపుంగవులు రచించిన కృతి రత్నములను బఠించి యంతనే తనివినొందక చేతనైనఁ గవిహృదయము చెడకుండ భాషాంతరీకరణ మొనర్పఁ గలిగిన నదియు స్వభాషాసేవయే యగునని నే నిటులు మొదలిడితిని. సంస్కృత భాషలోనున్న చాల గ్రంథములను సమర్థులగు పండితవర్యులు తెనుఁగున వ్రాసి యాంధ్ర సారస్వతమునకు వన్నెఁ దెచ్చియున్నారు. ఆంగ్లేయభాషలో గూడ మహాకవులు విరచించిన గ్రంథములు పెక్కులు గలవు. వానిలోఁ గొన్నియైనఁ దెలుఁగున వ్రాయఁబడినచోఁ దత్కవి సంప్రదాయములును, నవీన కల్పనలును, నపూర్వ వర్ణనలును మున్నగునవి మనకుఁ దేటఁబడును. మఱియు నందలి వర్ణనలు కొన్నికొన్ని మన సంస్కృతాంధ్ర కవి శిఖామణుల వర్ణనలవలె మిక్కిలి మనోహరముగ నుండవచ్చును. ఉదాహరణమునకై ముదుసలియగు రుస్తుము తన ప్రాయపు దివసములను జ్ఞప్తికిఁ దెచ్చుకొనుట కవి యెట్లు వర్ణించెనో యిందలి 170 యవ పద్యముఁ దిలకింపుఁడు. వెండియు 109, 155, 168 మున్నగు పద్యములందలి వర్ణనలు కూడ దిలకింపుఁడు. వేయేల? ఆంగ్లేయభాషయందే కాక యేభాషయందైనను మహాకవులు రచించిన విషయములు

దెలిసికొనుట మనవిధియనియు, నట్టివి మన భాషలోనికిఁ దెచ్చుట భాషాపురోభివృద్ధికి మూలమనియు నా యాశయము.

వచనరచనకై "హోమర్" (Homer) కవి కృతమగు "ఇలియడ్" (Iliad), "ఒడెస్సి" (Odyssey) అను నితిహాసద్వయమ్ము నాంగ్లేయభాషలో లెస్సఁగఁ జదివి యుంటిని. అందు మొదటి యితిహాసమును వచనరూపమున వ్రాసి ప్రచురణమునకై "ఆంధ్రవిజ్ఞాన భానూదయగ్రంథ మండలి" వారి కొసంగితిని. దానికిని, నీపద్య ప్రబంధమునకును జాల విషయములలో సాదృశ్యము గనఁబడుటచే నిద్యాది నామనము నాకర్షించి భాషాంతరీకరణ కౌతూహల మొదవించెను. మచ్చున కిందలి 29—34 పద్యములలోని సైన్యవిన్యాస వర్ణనమును, 110—115, 131—145 పద్యములందలి ద్వంద్వ యుద్ధవర్ణనమును బోలు వర్ణనలకుఁ బై గ్రంథమండలివారు ప్రకటించిన "హెలెన" యను నాగ్రంథమున 20, 21, 48 పుటలను గనుఁడు.

ఈ చిన్నిపొత్తమును భాషాభివృద్ధికి మార్గదర్శకులగు పెద్దల కట్టుబాటులకు లోఁబడియే కడుజాగరూకతతో రచించితిని. అయినను నాకు భాషాసాహిత్య మలఁతి యగుటచే లోపము లుండును. వానిని మన్నించి గుణములున్న యెడ వానినే గ్రహింపుఁడని పాఠక మహాశయులను వేఁడుకొనుచున్నాను. మఱియు నిట్టి భాషాంతరీకరణములు కళాశాలలలో నున్నత విద్యను గఱచుచున్న విద్యార్థుల కుపయుక్తముగ నుండుననియు, వారికి స్వభాషాభిమానము స్థిరపడుటకుఁ దోడ్పడుననియుఁ గూడ నా యభిప్రాయము.

కథ సుగమము గనుక వేఱుగ వ్రాయలేదు.

ఇందు దాహరింపఁబడిన పట్టణములు, నదులు మున్నగునవి నిరూపించుటకై దేశపట మొకటి చేర్పఁబడినది. ఇందులకు నా మిత్రులును, పై మండలి కార్యదర్శిగారును నగు శ్రీయుత సింహాద్రి వేంకట నరసింహ మూర్తిగారికి నేను కృతజ్ఞుఁడను.

నా ప్రణయముఁ బాటించి శ్రమమున కోర్చి యీ పద్యప్రబంధము నావలన వినియు, ముద్రిత పత్రములఁ జక్కఁగఁ బరిశీలించియు నాకు మిగుల సాహాయ్య మొనర్చిన ఉర్లాం సంస్థానమందలి ప్రధాన పండితులును, ప్రసిద్ధ గ్రంథకర్తలును, నా మిత్రులును నగు బ్రహ్మశ్రీ కొంఠి భద్రాద్రి రామశాస్త్రిగారికి నా నమఃకుసుమము లర్పించు వాఁడను.

ఇట్లు,

నరసన్నపేట. 1—9—1915.

సుకవి పండితజన విధేయుఁడు,

యల్లాపంతుల జగన్నాథం.



# ఆ గ ర్భ శూ రు లు.



ఉ. తూరుపుదిక్కు తెల్వఁగొనె; దూఁగుచుఁ జిన్నిమొయిళ్లు పోల్కిడై
వాటెడు నవ్వు "డాళ్ససు" స్రవంతిపయిన్ బాగమంచు లేచి; తా
ర్తారులదైన మేటి శిబిరమ్మున నింకఁ బ్రశాంతిపూరమే
పాఱుచునుండె సుప్తియను పాశము జోదులఁగట్టి యుంచుటన్. 1

గీ. "స్కోప్రా" బొక్కఁడె రేయెల్ల సుప్తిలేక
యుండె మనమున నేమేమి యో తలంచు
కొనుచు; నంతటఁ 'గొక్కురో కో!' రవములు
రేఁగె; దిగసెజ్జ నతఁడు 'సరే' యటంచు. 2

క. బిఱబిఱఁ దొడిగెన్ గవచము;
కరవాలము మొలనువ్రేలఁ గట్టెను; మంచున్
సరకుగొనకేగె నతఁడ
త్రోవఁ "ఏరనువీజ" యున్న తావున కల్లన్. 3

ఉ. నేనఁగి నన్నదీతటము వెంబడి గొప్పలుఁ గుప్పలై సము
ల్లాసముఁ గొల్పుజుంటి పెరలనగు నల్లని వస్త్రవేశ్మముల్
వాసిస్రవంతి చెంతఁగను పట్టిడి మిట్టనొకండు మెల్లనన్
దాసె నతండెదన్ బలువిథమ్ముల భావము లాజి నల్పఁగన్. 4

గీ. తొల్లి యామిట్టపై మంటి దుర్గమొకటి
గట్టియుండిరి; యది యిప్డు కాలనిహతి
విగతమగుటయుఁ ఏరను వీజదైన
పటకుటీరము నిర్మింపఁ బడియె నచట. 5

గీ. అందు వైశాల్యమందము ♦ నమరియుండెఁ;
బఱచి కెల్లెడ రత్నకం ♦ బళులు నేల;
వృద్ధసేనాని వృద్ధత ♦ వెలితి నిదుర
సేయుచుండెను; దరినుండె ♦ నాయుధములు. 6

ఉ. మెల్లనవచ్చి శయ్యకు స ♦ మీపమునన్ నిలుచుండె సోప్రహ; బా
మెల్లని రాకగూడ బలి ♦ మిన్ నిదురన్ దెలుపంగ గుండియల్
జల్లనఁ జూచిలేచి రభ ♦ సమ్మున నాతఁడు వానితోడ మే
నెల్ల వడంకుచుండఁగనె ♦ నీగతిఁ దొందరపాటు మాటలన్. 7

ఉ. "ఓయి! యెవండ? వేమిపని ♦ యున్నది? తూరుపు తెల్లవాఱ లే
దే? యిటకేల వచ్చితివు? ♦ దేమయినన్ దెలుపంగ నున్నవే
దాయలవార్త? లేమియొ యు ♦ దంతము చెప్పుము; నిన్నుఁ జూడఁగా
వేయి వితాలఁబోవు మది ♦ వేగ వచింపుము కార్యభారమున్." 8

చ. "అనవిని సోప్రహబిట్టులను, ♦ నార్య! పరుండను గాను; సోప్రహబే;
నినుఁకుడయింపలేదు; భటు ♦ లెవ్వరు నిద్దుర వీడలేదు; నా
కునిశన దేమొకాని యొక ♦ కొంతయుఁ గంటికిఁ గూర్కు రాక పో
యెను; దెలవాఱ వచ్చె నిఁక ♦ నేనని నీయెడ కేగుదెంచితిన్. 9

క. "మన నృపుని ముదల నాకి
ట్లని కాదొకో? నీదుసేమ ♦ మరయును మాపీ
రను వీజ; వాని నీజన
కుని రీతిగ నెపుడు చూచు ♦ కొనఁ జను నంచున్? . 10

ఉ. "కావున నీకు నామది నిఁ ♦ కన్ వెలివుచ్చెదఁ; గాని నేనెటుల్
సేవక వృత్తిఁజేటి ప్రభు ♦ చిత్తమెఱింగి చరింపుచుంటినో
కేవల బాల్యమందె యని ♦ కిన్ వెనుదీయక దొడ్డబంటు ల
ట్లే వహిశాస్త్రవుల్ తలఁక ♦ నేత్తెఱఁ జూపితినో యెఱుంగవే? 11

చ. “అని మొననిల్చి లావుమెఱ ♦ యన్ వెయిసారులు పారసీకులన్
దనివిగ వీఁగఁజేసి ప్రమ ♦ దమ్ము మెయిన్ మనగెల్పుఁ డెక్కెముల్
చొనుపుచుఁ బోవు చోరిపు వ ♦ సుంధరఁ బొంపిరి వోవు కోర్కెమై
ననవరతంబు నే నెవని ♦ నారయుచుంటినొ నీకుఁ దెల్లమే. 12

గీ. “అట్టి నాతండ్రి జగజెట్టి ♦ యైన ‘రుస్తు’
మేరణస్థలి యందైనఁ ♦ దారసిల్లి
నాకడిమిఁగని తనపుత్త్రి ♦ నన్నుఁ బ్రేమఁ
జేరునోయంచు నువ్విళు ♦ లూరుచుంటి. 13

గీ. “కాని యాభాగ్య మెన్నఁడు ♦ గలుగదయ్యె;
సరియె; నను విను; నేఁడిరు ♦ సైన్యములును
బెనఁగుటుడిగింపు; మొంటి పో ♦ రునకుఁ బిలుతుఁ
బారసీకుల నడిసన్న ♦ బంటు నొకని. 14

క. “నేనే దానం గెలిచితి
నే నది చెవులార రుస్తు ♦ మెటులైన వినుం;
గాని యటుఁగూలితినొ నా
కీనాఁడే యతనిఁ జూడ ♦ నిచ్చ దొలఁగెడిన్. 15

ఉ. “వెండియు నన్నిదేశముల ♦ వేలకొలంది జనుల్ పొరింబొరిన్
భండనమున్ బొనర్ప రొకొ? ♦ పల్వురు ప్రమందరె పేరులేక? య
ట్లుండమ ద్వంద్వ యుద్ధమున; ♦ నొక్కని నింకొకరుండు దాఁక నొ
క్కండె కదా జయించు? నటు ♦ గావున నాతఁ డనంబు గాంచఁడే.”

క. అని మిన్నకుండుటయుఁ బే
రనుపీజ గ్రహించి తనక ♦ రమున నతని కే
ల్గొని నిశ్వసించి యతఁ డి
ట్లనె ననురాగంబు చిందు ♦ నట్టి నొడువులన్. 17

ఉ. "ఓయి కుమార ! యిట్లు మది ♦ నూరక కాఱియవెట్టెదేల ? య
య్యో! యిటు లేమమ్ముఁ గలసి ♦ యుండి దురంబొనరింపు; కాని నీ
వాయసహాయశూరు నెటు ♦ లైనఁ గనుంగొన ద్వంద్వ యుద్ధముం
జేయుదువే? యిఁకం దలఁపఁ ♦ జెల్లవు చిన్నతనంపుఁ జెయ్దముల్. 18

గీ. "ఇంతకును వానిఁ గనకున్కి ♦ నెన్నఁడేని
రుస్తు మెటువంటివాఁడొ యె ♦ ఱుంగ వీవు ;
గాన మముఁగూడియే యంత ♦ వాని సుతుఁడ
వగుట కనువుగ నతము శౌ ♦ ర్యమ్ము నెఱపు. 19

ఉ. "రోసెదఁగాక యెట్లయిన ♦ రుస్తుము నంచుఁగడంగితేని ని
ట్లా? సమరంబుఁజేసి యొకొ? ♦ యయ్యయొ! నన్వివను మట్లుగాక నా
యానముమైరణంబు డిగి ♦ యూరయు ; మాతఁడు నిన్నుఁజూచి సం
తోసపసుం దనంతటి సు ♦ తుండు గలండని విఱ్ఱవీఁగుచున్. 20

గీ. "తొల్లి నా చిన్ననాఁట రు ♦ స్తుము ననేక
కదనముల నెప్డు సేనాము ♦ ఖమున నిల్చి
పోరుచుండుటఁ గంటి ; ని ♦ ప్పుడు తఱచుగఁ
బారసీకుల యందుఁ గన్పడుట లేదు. 21

ఉ. "వేసఱి పాయమేద సర ♦ విన్ రణసీమఁద్యజించి యస్త్రస
న్యాసము సందెనో ప్రబల ♦ మైన వివాదము గల్గితనిపై
రోసముఁ బూనియుండెనో యె ♦ ఱుంగను గాని సుఖంబుగాని జా
వాసముఁ జేఱి యిప్పుడెడఁ ♦ బాయక తండ్రిని గొల్చు వృద్ధునిన్.

గీ. "అచటి కరుగుము ; పా—మ్మేల ♦ యరుగ ననెద ?
వకట ! నేఁడేదియో ఘోర ♦ మగుట నిజము ;
వినుము సోహ్రాబ ! నామది ♦ వెతనె తెలుపు
చున్న యది ; నీల్గెదవు నీవు ♦ యుద్ధభూమి. 23

మ. " మము నీ విప్పెడఁబాసిపోవుట యగుర్ ♦ మాకెన్నఁడున్ బోని లో
పమె; మైనన్ బితఁజూచి వచ్చుటకుఁ బో ♦ వంగోరితే నీ నిమే
షమె వృత్తెంచెదఁ; గాని ద్వంద్వ సమరో ♦ త్సాహంబు చాలింపు కా
ర్యములే దూరక మిత్తివాతఁ జొరబా ♦ ఱన్ జూతురే వెఱ్ఱులున్?

గీ. "అయిన నెవరాఁపఁగలుగుదు ♦ రాము గొన్న
కుంజరముఁ గన్న సింగంపుఁ ♦ గొదమ? నటులె
రుస్తుమునిపట్టి నెవరు నే ♦ ర్తురు మరల్ప?
పొమ్ము సోహ్రాబ! నీ యభీ ♦ ష్టమ్మె తీర్తు." 25

సీ. అని యొయ్యఁజార్చి యా ♦ తనిచేయి పీరను
వీజయంతట పాన్పు ♦ విడచి వడిగ
ధరియించి చలిచేత ♦ బిఱుసు వోయిన శరీ
రమ్మున రోమ కూ ♦ ర్పాసకంబు
తొడిగి పాదములఁ బా ♦ దుకలుపై నిడుకొని
వెచ్చని రోమంపుఁ ♦ బచ్చడంబు
బెడిదంపు టడిదంబు ♦ విడనాడి కుడిచేత
రాజదండంబు గా ♦ రమునఁ దాల్చి

గీ. యున్ని కుళ్ళాయి శిరమున ♦ నూని పటకు
టీరముఖమున కరుదెంచి ♦ శివిమెఱయ
నచటి తెరయెత్తి తన ప్రతీ ♦ హారు నొకనిఁ
బిలిచె నాతఁడు సన్నంపు ♦ టెలుఁగు తోడ. 26

ఆ. ప్రొద్దుపొడువ నంతఁ ♦ బొగమంచు తొలఁగె నా
క్ససుస్రవంతి నచటి ♦ సైకతముల;
నశ్వబలమె కలిగి ♦ నట్టి తార్తారుల
దండు వరుసఁదీఱు ♦ చుండె బయట. 27

చ. తెలతెలవాఱ సైనికుల ♦ తిత్వరితంబుగ వస్త్రవేశ్మముల్
వెలువడి నాయకుల్ మొదల ♦ వెట్టఁగ బైటహయాధిరూఢులై
వెలసిరి బార్లుదీఱి విను ♦ వీధుల నొక్కొక కాలమందు గుం
పులుగఁ దమంతనే వలస ♦ పోయెడి పక్షులశ్రేణు లట్లుగన్. 28

క. ఒకచోట నాక్ససు నదీ
నికటావని విడియుభటులు ♦ నెలకొని రొగి ను
న్నికుళాయ లీఁటె లూని య
ధిక బలవంతులు పరువపుఁ ♦ దేజీలపయిన్. 29

క. ఒకచో ‘‘టుర్క్మను’’ లొకచో
‘‘తుకాలు’’ రణకౌతుకంబు ♦ తో ‘‘సాలో’’ ‘‘ర
త్రకు’’ శాక్తీకులమరి ర
ల్పకాయులు జవంబు సూపు ♦ వావురములపై. 30

క. ఒకచో ‘‘జాక్సార్టీసు’’ న
దికి నిరుక్రేవల వసించు ♦ దిటవరులను వై
రి కుఱుచ గడ్డంబులు బిగు
వు కుళాయలతోఁ గడు వెర ♦ వున మావులపై. 31

క. ఒకచో మరుభూములఁ బా
యక త్రిమ్మరుచుండు మొఱకు ♦ లా ‘‘కాల్మకు’’ ‘‘కు
జ్జకు’’ ‘‘కర్గిజీసు’’లు రణో
త్సుకత నధివసించి రచ్చ ♦ తురగంబులపై. 32

గీ. ఎలమిఁదార్తారుల దళంబు ♦ లిట్లు మొనయు
చుండ నలపారసీకులు ♦ నోలమాన
గొనక వానికిఁ గట్టిదు ♦ ట నొకవంక
నపుడె సన్నద్ధులైరి యు ♦ ద్ధాదరమున. 33

గీ. ముందు తార్తారుల దళంబు ♦ వోలె వారు
వములపై "నిల్యతులు" వెన్క ♦ బారసీక
ప్రభుని యశ్వబలంబు కా ♦ ల్బలము నిలిచె
నాయుధము లెండలోఁ దళు ♦ క్కనుచు నుండ. 34

మ. వీరను వీజ యంతఁగను ♦ వేగముమైఁ బ్రతిహారు తోడఁ దా
ర్తారులసేన ముంగిటికిఁ ♦ దానరుదెంచి పిఱిందికేగుఁ డో
శూరులటంచుఁ బ్రాభవముఁ ♦ జూపుచు ముందఱి బంతులన్ గనున్
దూరము వెన్నకున్ దొలఁగఁ♦ద్రోయుచు నూఁపుచు రాజదండమున్.

గీ. దానిఁగని పారసీక సే ♦ నానియామ "పె
రూషు" తన బల్లెమును వ ♦ రూధినీ స
మక్షమున కరుదెంచి య ♦ మంద బుద్ధి
నగ్రపఙ్క్తులఁ బిఱిదికి ♦ నాఁపె నతఁడు. 36

ఆ. అంత మురిప మెసఁగ ♦ నా పెద్ద పడవాలు
మ్రోలకరిగి రెండు ♦ మొనల నడుమ
నెఱయు నిసుక నేల ♦ నిలిచి యుత్తెఱఁగున
ననియె వారు వీరు ♦ నబ్రమంద. 37

శా. "ఆ కర్ణింపుఁడు పారసీకులిదె నేఁ ♦ డాలంబు చాలింత ; మ
స్తోకాటోప పరాక్రమాన్వితుఁడు మా♦సొహ్రాబునిందొంటిగాఁ
దాఁకంజాలెడు నెక్కటీని నిపుడా ♦ స్థలమీరు నేమించి వే
నాకుం దెల్పిన నొంటిపోరునకు స♦న్నాహంబుఁ గావించెదన్." 38

ఉ. వేకువ వేళ మంచుతెఱఁ ♦ బెల్లుగ రాజనపుం బొలాన వ
ర్ణాకృతి మంచుబొట్లురల♦నందలి సాంద్రపు సస్యమంజరుల్
వీఁక వడంకునట్లు తమ ♦ వీనుల నాతని పల్కుఁ జన్నుఁ బాల్
సోఁకుటమై గగుర్పొడువ♦సోహ్రాబు మెచ్చిరి నెమ్మిఁ దార్తరుల్. 39

ఆ. కాని యమ్ముది మొన ♦ గాని పల్కులు వాఁడి
ములుకులగుట జాను ♦ గులుకు బార
సీకులంత నలుకు ♦ చే వెలవెలఁ బోయి
సారిది మొకమొకాలు ♦ చూచుకొనుచు. 40

శా. పోకున్నన్ జెముసార్థమొంచు తొలిఁ 'గా ♦ బూల్' వాసి మార్గానఁ 'హిం
దూకుష్' పర్వత పఙ్క్తి దాటుచుఁ బయిన్ ♦ దూఁగాడు నీహారఖం
డైక వ్రాతము వెచ్చనూర్చిన ద్రవం ♦ బౌనంచు నిశ్వాసముల్
లేకెట్లుంచుదు రట్లె యుండి రెద నో ♦ లిన్ జేష్టలూనమ్ముగాన్. 41

గీ. తోడనె పెరూదు వచ్చె "గు ♦ దుర్జు" దొట్టి
తగిన ప్రముఖుల కడకుఁ గ ♦ ర్తవ్యమేమి
యంచు ; మంత్రము నొనరించి ♦ రంద; అంత
కొంత వడికి గుదుర్జు వా ♦ క్రుచ్చెనిట్లు. 42

గీ. "ఇడుమ దొరకొనియె పెరూద! ♦ యిఁక మన మవ
మానమున కొడిఁగట్టితి ♦ మేని సరియె ;
కానిచో నెట్లైన నె ♦ క్కటి ఘురమున
కియ్యకొని తీరవలె బను ♦ వేదకుండ. 43

ఉ. "పోటరి సోహ్రాబున్ సమర ♦ భూముల నొంటిగఁ దాఁకఁ జాలు దోః
పాటవ మొప్పువాఁడు మన ♦ పౌజున నెవ్వఁడు లేక యుంట ము
మ్మాటికి నిక్కువంబు ; ప్రతి ♦ మానము వానికి సింగమా నిరా
ఘాట పరాక్రమంబున; మృ ♦ గంబె ప్రధావనమందు నుద్దియా. 44

ఆ. "కాని రుస్తుమిటకుఁ ♦ గడచిన రేయి యే
తెంచినటులు నాకుఁ ♦ దెలియవచ్చె ;
బ్రాఁతకనలు తన్నుఁ ♦ బాయమి దావేసి
కొనియెఁ గొవు గాఁగ ♦ దనగుడారు. 45

క. "అరసెద నిపుడే యాతని ;
నెఱిగించెద నంతవట్టు ♦ నీవృత్తము నీ
తరుణుని నామము ; నీకుఁ జిఱు
చిఱులుడిగి యతండు కలను ♦ సేయఁగ వచ్చున్. 46

ఆ. "అంత దనుక వాఁగు ♦ నటులె సమిన్నహి
నిలిచియుండ నిమ్ము ; ♦ నీవు మ్రోల
కరిగి నొడువు మొంటి ♦ యాలమ్మునకు నియ్య
కొంటి మింకఁగాచి ♦ కొనుఁడటంచు." 47

చ. అనుటయు సంతసంబొదవ ♦ నాతఁడు ముందఱి కేగి, "నీవు చె
ప్పిన యది మాకు సమ్మతమె ♦ పీరను వీజ! క్షణంబులోన మే
మనువొనరింతు ముక్కుతుని♦యన్ నెఱబంటును; సోహ్రాబింతలో
ననికయి సర్వ సిద్ధముగ ♦ నాయుధముల్ ధరియింప ని"మ్మనెన్. 48

క. అనిన విని వల్లె యని పీ
రను వీజ రణావనిన్ దొ ♦ లఁగి క్రేవలకున్
జనుచు భటుల్ దెరువిడఁ దో
డనె పోయి బిరానఁదన గు ♦ డారముఁ జేరెన్. 49

ఉ. అంత గుదుర్జు సైనికుల ♦ నందఱ నిట్టటుఁ ద్రోసికొంచు న
త్యంతరయమ్మునన్ శిబిర ♦ మంతయు దాటినదీతటంబుపై
నెంతయు దవ్వులన్ విడిసి ♦ యిమ్మతి యుండిన దిట్ట శత్రులో
కాంతకు రుస్తుమున్ గనుట ♦ కాతని మేటిగుడారు డగ్గఱెన్. 50

గీ. రుస్తుముని వస్త్రవేశ్మము ♦ రోహితచ్ఛ
విని గలిగి చాలలే యెండ ♦ వెలుఁగుచుండె ;
నతని భటవర్గమంతయు ♦ నట్టి పటకు
టీరములయందె చుట్టునుం ♦ డిరి వసించి. 51

ఆ. అతఁడులోని కరుగు ♦ నప్పటి కాసీనుఁ
డయ్యె రుస్తుమపుడె ♦ యారగించి;
మ్రోల నింక నటులె ♦ రొట్టెలు ఫలములు
నెఱచు లొక్క కొన్ని ♦ నెఱసియుండె. 52

ఆ. ఉబుసుపోవ రుస్తు ♦ మొక సాళ్వమును జేతి
పైని వ్రాలఁజేసి ♦ దానితోడ
నాడుకొనుచునుండె ♦ నలవొక; నంత గు
దుర్జు వచ్చి తన యె ♦ దుటనె నిల్చె. 53

క. వానిం గని యానందము
తో నాశ్యేనము నవలికిఁ ♦ ద్రోసి యతనికిఁ
దా నెదురు వోయి నతులె
న్నో నొనరిచి ప్రియము దొలుక ♦ నిట్లనఁ జొచ్చెన్. 54

ఉ. "స్వాగతమే గుదుర్జు! కను ♦ పంపు వొనర్చితి వీవు నాకు; నేఁ
డీగతి నేగుదెంతు వొకొ ♦ యేమొ విశేషములున్నఁగాని? యా
రోగిణముగ్ బొనర్చి మును ♦ రుస్తుముఁ బ్రీతునిఁజేయు వెన్క నీ
యాగమ మన ప్రయోజనము ♦ నారయుఁబోలును లెమ్ము ర"మ్మనన్.

క. విని నిలిచియె యతఁడిట్లను
"దినుటకుఁ ద్రావుటకు నియ్య ♦ ది యదను గా; దీ
దినమున వానిందలఁ పని
పని యున్నది; నీకుఁ దెలుప ♦ వచ్చితి దానిన్. 56

ఉ. "సేనలు రెండు నిష్ఠురణ ♦ సీమ ముఖాముఖి నిల్చియుండె; బిం
కాన ద్విషచ్చమూ విభుఁడొ ♦ కానొక వీరునిఁ బేరుకొంచనిన్
వాని సమాను నిష్ఠను వొ ♦ నర్పుమనన్ మన పారసీక సే
నాని యధైర్యమొంది మది ♦ నన్నిటు నీకడ కంపె వింటివే? 57

ఆ. "అతనిపేరు సోహ్రా ♦ బఁట; కాని యాతని
జన్మవృత్త మెఱుఁగఁ ♦ జాలకుంటి;
మోాయిరుస్తు! మెందు ♦ నుద్ది నీ కాతఁడె
సుమ్ము బలపరాక్ర ♦ మమ్ములందు. 58

ఉ. "మాటలు వేయునేల? ప్రతి♦మానము వానికి సింగమే నిరా
ఘాట పరాక్రమంబున; మృ♦గంబె ప్రధావనమందు సాటి; యీ
నాఁటికి ముప్పవచ్చెఁ గద ♦ నంబున నాతని నోర్వఁజాలు నీ
బోఁటి ప్రసిద్ధ వీరుఁ డిఁకఁ ♦ బుట్టుట గానను బారసీకునిన్. 59

గీ. "వెండియు నతంఁడు వయసున ♦ నుండె; బార
సీక ముఖ్యులు ప్రాయము ♦ చెల్లియుండి;
రొండె దుర్బలు; లెంతయు ♦ నొచ్చెమొదవు
నీ విటులు మాకుఁ గెవ్వుంటి ♦ వేని యింక. 60

క. "రమ్మటుగావున; నల కో
పమ్ముడుగుము; మాకు సాయ ♦ పడు; మిఁక నిన్నే
నమ్మితి; మటుగా దేని జ
యమ్మరులకు మనకు నవజ ♦ యము సిద్ధమె చూ." 61

గీ. అనినఁ గరునగ వొలయ ని ♦ ట్లను నతంఁడు;
"చాలుఁ జాలును! వారె ము ♦ నలులు గాని
నేనుకానొకో? మఱియు మీా♦నృపుఁడు క్రుద్ధుఁ
డగు వయస్థులు దుర్బలు ♦ లంటివేని. 62

ఉ. "ఏమనఁదా వయస్థుఁడగు ♦ టెవ్వ రెఱుంగరు? సాటివారిపై
బ్రేమము మెందు వాని; కిఁక ♦ వృద్ధులు గాటికిఁ గాళ్లుచాచి రం
చా మహనీయుఁడిట్లు మము ♦ నంపఁటి నొప్పరికించెఁ; గాన నీ
వీ ముదిబంటుఁ బిల్చుటుఱ♦వే? తలవంపులు గావె చేనికిన్? 63

ఆ. "పిన్న వయసువాండ్రు ♦ పెక్కండ్రు నీ బోఁటి
వారలుండ నేనె ♦ వచ్చి సాహ
బు నిపుడొంటి కయ్య ♦ మునగల్చి యాతని
యహమహమిక నేనె ♦ యడఁపవలెనె? 64

శా. "వేనోళ్ళం గొని యాడనిమ్ము తని నీ ♦ విశ్వాసంబు; నాకేల? యా
హా! నాకూఁతునకున్ బదులొక్కడుకు సా ♦ హసవంతవాఁడుండినన్
వానిం బోరుల కంపియుండనొ సదా ♦ నాతండ్రి చెంతన్? బరా
ధీనుండయ్యె నతండు నేఁడు తనకున్ ♦ దిక్కెవ్వరున్ గల్గమిన్. 65

గీ. "వెలవు దక్కియతం డతి ♦ వృద్ధుఁడగుట
గాసి వెట్టుదు రిప్పుడాఫ్ ♦ ఘనులు వానిఁ
బెక్కు విధముల; నీవయో ♦ వృద్ధుఁడతని
పజ్జ నిక్కనైన నుండుట ♦ పాడి గాదె? 66

ఉ. "నోఁచఁగ నైతి నంతటి త♦నూజుఁడు కల్గుట; కింకఁజాలు నీ
నీచపు వృత్తి; శీఘ్రముగ ♦ నే నిలు సేరి సతంబు దండ్రినే
ప్రోచుచు మీకృతఘ్నులగు♦భూపుల సేనలు వీఁగఁగన్నులన్
జూచుచు నుందు; విందునల♦సాహసంబు గాంచెడి కీర్తి యంతయున్. 67

క. "కాని యిఁకెన్నండసి చేఁ
బూని సమర రంగమునకుఁ ♦ బోవను; ప్రాయం
బా నశియించెను మఱి మె
ప్పా నాఁడే పోయె; వెట్టి ♦ యయ్యెఁ జివరకున్." 68

క. అని వెండియు దరహాస
మ్మొనరింపఁగ ననియె నాతఁ ♦ "డోరుస్తు! మిఁకే
మనెదరు నలుగురు నీపిటు
మునుపటి కన లింకను దల ♦ పోయుచునున్నన్? 69

ఉ. "ఎక్కటి కయ్యమందు దన • కీడగు నాతఁడు రుస్తు; మట్టిఁ డిం
కొక్కఁడు లేమి దానెఱుఁగఁ • డో? యిది సోహ్రాబు నిన్నుఁగోరుటే
తక్క మఱేమి? నీ విటులు • దాఁగుట చెల్లునె యెట్టులైన నా
యుక్కరి నిన్నె మార్కొనుట • కువ్విళు లూరుచునుండ నిత్తఱిన్?

గీ. "మఱియు నెవరేని 'కృపణుని • కరణి దనయ
శోధనముఁబోగుచేసె రు • స్తుమివు; డైనఁ
బిన్నలు హరింతురని చాల • వెఱచుచుండు'
ననిన నీకెంతయో చిన్న • తనము కాదె?" 71

క. అన నత్యంతాగ్రహముం
గొని యిట్లను రుస్తు, "మెవరు • గోరిరి నిన్ని
ట్ల నవసరంపుఁ బ్రసంగ
మ్మొనరింప గుమర్జ? యూర • కుండుము; మఱియున్. 72

ఆ. "ఒకఁడు కీర్తిమంతుఁ • డొకఁడు సామాన్యుఁ డిం
కొకఁడు ధైర్యశాలి • యొకఁడు పంద
పిన్న యొక్కఁ డొకఁడు • వృద్ధుఁడునై యుండ
వచ్చు; దాన నేమి • వచ్చు నాకు? 73

క. "కారొకో మర్త్యులు వా? ర
ట్లే రుస్తుము గూడ మర్త్యుఁ; • డెవఁడు కృతఘ్నుం
డౌ తేని మెప్పవడయం
గోరి నెఱవు శౌర్యమని న • కుంఠిత భక్తిన్? 74

మ. "అయినం జాతువుగాక పిన్నలెటున • న్నాలమ్మునన్ గల్చి నా
దు యశంబెట్లు హరింతురో! వినుము శ • త్రువ్రాత మీరుస్తు మి
మ్మెయిఁదో తెంచుటెఱుంగఁగావలదు చు • మ్మీనేఁడు ప్రచ్ఛన్న వృ
త్తిమైకొంచు దురంబు సల్పుటకు ను • ద్దేశించితిన్ బొమ్మిఁకన్."

గీ. అనుటయు గుదుర్జు మఱలి చి ♦ వ్వన శిబిరము
దాటి చనియెను తన మాట ♦ దక్కఁ రుస్తు
మరుగుదెంచు ననుముదంబు ♦ నతని కోప
మునకు భీతియు మనమునఁ ♦ బెనుగొనంగ. 76

క. అంతట రుస్తుము ద్వారము
చెంతకుఁ జని భటుల కాజ్ఞ ♦ సేయఁగ వార
త్యంత రయమ్మునఁ దెచ్చిరి
కాంతులు వెదఁ జల్లు నతని ♦ కవచాయుధముల్. 77

చ. కవచము మేననూనెఁ దమ ♦ కమ్మున ; నంతకుఁ బూర్వ మెన్నఁడుఁ
బవరము మోమెఱుంగనిని ♦ బల్లెము డాలును గేలఁబట్టె; స్వ
ర్ణ విహితమైన నూతన శి ♦ రస్త్రము నౌదలఁ దాల్చెనందు వా
రువపు నెఱుల్ చెలంగి పయి ♦ గ్రుచ్చుతు రాయని యాడుచుండఁగన్.

గీ. ఇట్టులాయుధములు ధరి ♦ యించి రుస్తు
ము తన మేటి గుడార మ ♦ వ్వాడె వెలువడెఁ;
బిల్లనాఁడు మొదలు తాను ♦ పెంచినట్టి
యశ్వ మొక్కఁడు తన్ను వె ♦ న్నాడుచుండ. 79

క. వెలువడి నిముసములో నతఁ
డలవోక శిబిరము దాటి ♦ యరుదెంచెను; క
న్నుల విందు పారసీకుల
కలనాఁడు కదా యొనర్చె ♦ నాతఁడు మఱలన్ ? 80

గీ. వానిఁగని యొక్క పెట్టునఁ ♦ బారసీకు
లందఱును గ్రేళ్లుదాటి రా ♦ నంద మొంది ;
కాని తార్తారు "లితఁడెవ్వఁ ♦ డో ?" నటంచుఁ
జూడఁజొచ్చిరి యట్టె రు ♦ స్తుముని వంక. 81

సీ. వేఁకువాదిగ సంధ్య ♦ వేళ దాఁక సముద్ర
పుఁదరంగముల నాణి ♦ ముత్తెములను
దీయఁగ మున్గుచుఁ ♦ దేలుచుండిన భర్త
ప్రాణమ్మునకు భయం ♦ పడుచుఁ దీర
మున నిల్చి కన్నీరు ♦ మున్నీరుగా నేడ్చు
చుండిన యొక సతి ♦ యుల్లమునకుఁ
దాను వై కొన్న ము ♦ త్యముల హారము గూర్చు
కొని రేయి యిలుసేరు ♦ కొన్న మగని

యాగ మనమెట్లు మోదావ ♦ హమగు నటులె
యయ్యె మోదావహంబు ధై ♦ ర్యంబు తక్కి
యున్న యల పారసీకుం ♦ యుల్లములకు
శూర చూడామణి యగు రు ♦ స్తుముని రాక. 82

ఆ. రుస్తుమవుడు వారి ♦ మ్రోల కేగుటయు సో
హ్రాబు ముదంబునఁ దన ♦ యాయుధముల
నూని సరగ వచ్చు ♦ చుండెను పారసీ
కదళమున్నయెడకు ♦ గరువ మొప్ప. 83

క. నిలువఁబడి యట్లె తార్తా
రుల శిబిరము వంకఁజూడ ♦ రుస్తుము ధృతిమై
లలిఁబార విడిచిన సర్పము
వలె వచ్చెడి సోహ్రాబు కనఁ ♦ బడె నాతనికిన్. 84

సీ. తొలికోఁడి గూయని ♦ ద్దుర మేలుకొని మంచు
తఱియాటఁబెను జడి ♦ కరణి బయటఁ
గురిసెడి యివమున ♦ కున్ దాళలేక వ
ణంకుచుఁ జలిచేతఁ ♦ గొంకుపోయి

నట్టి వ్రేళులతోడఁ ♦ గట్టెలు విడిచి పే
రాస మంట యొనర్చి ♦ దాసి నిదుర
మెలఁకువరాఁగ న ♦ ర్మిలి భాగ్యశాలిని
యోర్తు తెరలచాటు ♦ నుండి చూచి

యెట్టులీ సీతువున కోర్చి ♦ యీమె బ్రతుకు
నీమె మది నేమి తలపోయు ♦ నిపుడటంచు
నచ్చెరువు నొందు పగిది సో ♦ ప్రాబును జూచి
వింత పడఁజొచ్చె రుస్తు మ ♦ త్యంత మపుడు. 85

చ. జనకునిఁ గన్నులార నొక ♦ సారియుఁ జూడఁగ లట్టి భాగ్యమిం
కను గనఁజాలకున్కి నెస ♦ కమ్మున నెంతటి జోదునైనఁ బో
రునఁ జెనకం గడంగు నల ♦ రుస్తుము నాత్మజుఁ జూచి రుస్తుమే
యనుకొనఁజొచ్చె నేమొ యిది ♦ యబ్బుర మెవ్వఁడితం డటంచెదన్.

సీ. ఆకాంక్షతో నొక్క ♦ రా కొమరిత స్వయ
మ్ముగ నీరువోయ ము ♦ ద్దుగఁ బెఱుగుచుఁ
బ్రమదావనమున స ♦ తము నీరుబుకు నొంటు
జలయంత్రమునకుఁ బ ♦ జ్జనె చెలంగి
నెలరేలఁ బండు వె ♦ న్నెల గొల్చు వేళఁ బ
చ్చిక నేల నెఱపుచుఁ ♦ జిన్నినీడ
సోగ తిన్నన పెంపు ♦ చూపఱకు ముదంబు
సేయ గిల్లినఁ బాలు ♦ చిప్పిలునఁ

గోమలంబైన క్రొమ్మావి ♦ గున్నపోల్కిఁ
దోఁచు సోప్రాబు నట్టె రు ♦ స్తుము గనుఁగొని
వాని లేజవ్వనమున కెం ♦ తేని జాలి
నంది రాసైఁగ చేసి యి ♦ ట్లనియె నతఁడు. 87

ఆ. "చిన్నవాఁడ! నేను ♦ జెప్పెద వినుము జీ
వించియున్న నను భ ♦ వించు నెవ్వఁ
డైనఁ గష్ట సుఖము; ♦ లటుగాక చచ్చిన
వాని కన్నిమంటి ♦ పాలు గావె? 88

ఉ. "చూడుము నన్ను; బల్లిదుఁడ ♦ సుమ్ము; ధరించితి నుక్కుజోడు; నా
తోడను బెక్కుసార్లు తమ ♦ దుర్మద మేర్పడ మేటిబంట్లు పో
రాడిరి; నమ్ము మేబవర ♦ మందుఁ బరాకునసైనఁగాని నే
నోడుట శాత్రవుండు మృతి ♦ నొందకయుండు టెఱుంగ నెన్నఁడున్.

క. "కావున నోయీ సోద్రాబు!
నీ వీగతి మిత్తికెదుర ♦ నిలువంబడు టే
లా? వలదు; మేలు గోరితొ
నావచనంబులను బాల ♦ నము సేయఁదగున్. 90

క. "ఈ తార్తారుల విడువుము;
నాతో నామందిరంబు ♦ న వసింపుము; నీ
వేతనయుఁడ వనుకొని యెదఁ;
జేతో మోదంబు నాకుఁ ♦ జేయుము మదిమిన్. 91

క. "నే నీల్గుదనుక నీఁక నా
తోనుండియె దురము సల్పు ♦ దువు గాక నిజం
బీ నాఁడు ధృతిని నీకు స
మానుఁడొకండైన లేఁడు ♦ మాదేశమునన్." 92

సీ. అని దయారస మొల్కు ♦ నట్లు సంభాషించు
నతని కంఠధ్వని ♦ నాలకించి
పూర్వమెన్నఁడొ మలి ♦ మ్లుచుల దాడికి జంకి
సామంతుఁడొక ప్రదే ♦ శమునఁగట్టి

నట్టికోపరసపు మ ♦ హోన్నత్యమున ఠీవి
నలరు నాతని విగ్ర ♦ హమును జూచి
ముదిమి చిన్నెలుగన ♦ వ్వాడె నరయుచు నున్న
నెఱుల నొప్పెడి వాని ♦ శిరముఁగాంచి
యప్పుడు మనమున నొకవింత ♦ యాస వొడమ
ముందుఁబోయి యతని మ్రోల ♦ మోకరించి
కరములను మోడ్చి మిగుల సం ♦ బరముతోడ
సోహ్రాబాతని నడుగంగఁ ♦ జొచ్చె నిటులు. 93

క. "హా! కనుఁగొంటిని ; రుస్తుమ
వే కద నీ? వవును ; సత్య ♦ మే? రుస్తుమవే
నాకుం దెలియును లె ; మ్మటు
గాకున్న నెవండవో త ♦ గఁ జెప్పఁగదే?" 94

క. అన రుస్తుమతనిఁ గ్రేఁగం
టనె కనుఁగొని కొంతవడి త ♦ టాలునఁ బెడమో
మొనరించి చిత్రమనుచుం
దనలోఁ దానీ కరణి వి ♦ తర్కించుకొనెన్. 95

క. "ఔనా నీతని భావము
నే నెఱుఁగుదు ; మఱియుఁ జాల ♦ నీచులు కపటుల్
సూనృత పరిపంథులు నెం
తే నభిమాన పరులగుదు ♦ రీ తార్తారుల్. 96

ఆ. "నిజము దాఁపకుండ ♦ నేనె రుస్తుమునంచుఁ
దెలుపవచ్చు; గాని ♦ ఫలితమేమి?
లోఁగఁ డితఁడు నాకు; ♦ నేఁ గోరినట్లు మా
యరుల పక్షము విడ ♦ నాడఁ డితఁడు. 97

గీ. "కాని యేదియొ మిషఁజెప్పి ♦ కలను మాను
కొని కడుంగడు నాదు కీర్తిని నుతించు;
మఱియు నాకేదియో బహు ♦ మాన మొసఁగి
తప్పెరా మృతియని తన ♦ దారి వట్టు. 98

క. "అదనెఱిఁగి యేదియో ప
ర్వదినంబున నృపుఁడు తగిన ♦ వారలతో స
మ్మదమునఁ గొలువుండ సభా
సదు లాకర్ణింప నిట్లు ♦ సంభాషించున్.  99

సీ. "వింటిరే నేను చె ♦ ప్పెడి వింత? మున్నొక
సారి యాక్సను నదీ ♦ తీరభూమి
సేనలు బవరంబు ♦ సేయంగ విడియనే
ద్వంద్వ యుద్ధమునకుఁ ♦ బారసీక
భటులలో నెవఁడేని ♦ వచ్చి నాతోఁ బోర
నిలిచి లావున్ననన్ ♦ గెలువఁ డంటి;
నంత నందఱు వెఱఁ ♦ గంది మిన్నక యుండ
రుస్తు మొక్కండె మా ♦ ర్కొనియె నన్ను

నపుడు మే మిర్వురమును బో ♦ రాడితిమి మను
కొంటిరో? లేదు; మే మను ♦ కూల వృత్తి
మించి యొండొరుల బహూక ♦ రించి కొనుచుఁ
బాసితిమి మిత్ర భా ♦ వమున నాఁడు. 100

క. "అని యాటకటాంకరి ప్రే
లిన శ్రోతలు మెత్తు 'రాబ ♦ లే!' యని; యిటు గ
ల్గిన యాన్యూనత కిఁక మిం
చిన న్యూనత యున్నె పార ♦ సీకుల?" కనుచున్. 101

ఉ. క్రమ్మఱ వానిఁ గాంచి యిటు ♦ గట్టిగఁ బల్కె నతండు; "చాలు; లే
లెమ్మల రుస్తుమేల? యిట ♦ లేఁడతఁ; డింతకు నేఁడు ద్వంద్వ యు
ద్ధమ్మున కీవు పిల్చిన క ♦ తంబున వచ్చిన నన్నుఁ జూచి శీ
ఘ్రమ్ముగఁ జెప్పు మింక సమ ♦ రం బొనరింతువొ లేక మానెదో.

గీ. "రుస్తుమునిఁ దప్ప నింక నొ ♦ రుల నెదుర్కొ
నంగ నొల్లవొ? బాలిశ! ♦ నన్ను వినుము
రుస్తుముని మోముఁ గన్న స ♦ మస్త జనులు
నడలి ధృతిశీర్ణమై ఱిచ్చ ♦ వడుదురంట. 103

గీ. "నిక్కముగ రుస్తుమే వచ్చి ♦ నేఁడు నీ యె
దుట నిలువఁబడి 'నేనె రు ♦ స్తుము' నటంచుఁ
దెలిపె నే నిఁక నని మాట ♦ దలఁప వీవు;
నే నెఱుంగుదు నది; సరి; ♦ దాని కేమి? 104

చ. "నినుఁ గనఁ జాలి యయ్యెడిని; ♦ నేరక చేసిన యట్టి నీ ప్రతి
జ్ఞను విడనాడి, 'యోడితిని; ♦ కావుమున' న్నని వేఁడుకొమ్ము; కా
దని యెదవేని నేఁటి కిఁక ♦ నాయువు మూడిన యట్లె నీకు; న
న్వినుము భవద్ధితైషినయి ♦ పిన్నవు నీవని యింత చెప్పితిన్." 105

క. అన లేచి నిలువఁబడి యా
తని కిట్లను సోహ్రా, "ఏవి ♦ ధంబు నభయ మొం
దను సుమ్ము నమ్ము నే స్త్రీ
ననుకొంటివొ మాటలకె భ ♦ యము నొందుటకున్? 106

గీ. "నీవనిన యట్లు రుస్తుమే ♦ నేఁడిచటికి
వచ్చియుండిన నని యొన ♦ ర్పను నిజముగ;
గాని యాతఁడిచట లేఁడు ♦ గద; యిఁకేల
నివ్వటిల్లదు కయ్యంబు ♦ నీకు నాకు? 107

శా. “కానిమ్మట్టును ధైర్యవంతుఁడవు; నా ♦ కంటెన్ బలాఢ్యుండ; వె
న్నేనాలమ్ము లొనర్చియుందు; వీఁక నే ♦ నెట్లైన బాలుండనే;
యైనన్ బోరుల గెల్చుటోడుటయు దై ♦ వాధీనముల్ గావునన్
నేనే గెల్తునటంచు వీఁగఁదగునే ♦ నిర్లక్ష్య భావంబునన్ ? 108

చ. “అది యెటులందువేని మన ♦ మంబుధి నీఁదెడివారి తీరునన్
విదియను వీచి కగ్రమున ♦ వ్రేలుచు నుండిన వారమాట న
య్యది దరిఁజేర్చునో మసల ♦ నబ్ధినె వెండియుఁగూల్చునో యెఱుం
గుదు మనరాదు; కార్యమొనఁ ♦ గూడిన సర్వము దేట తెల్లమా” 109

క. అన విని రుస్తుమపుడె యా
తనిపై సారించె నలుకఁ ♦ దన యీఁటెను; గు
వ్వను దఱుము డేఁగ వలె ఱి
వ్వున నది దోఁతెంచె సోహ్రా ♦ బును గదియంగన్. 110

క. దానిఁగని క్రొమ్మెఱుఁగు చం
దాన నతఁడు ప్రక్కకొఱగెఁ ♦ దత్క్షణ; మది యెం
తేనాద మొనర్చుచుఁ దో
డ్తో నేలను దూసి మేటి ♦ దుమ్మును రేఁచెన్. 111

క. ఇది యే తఱియని సోహ్రాబు
పదపడి యాతని పయిఁదన ♦ బల్లెము విసరెన్;
అది సూటిగఁ జనికడు బె
ట్టిద మగు రుస్తుముని యరిగ ♦ డీకొని త్రెళ్లెన్. 112

సీ. డాలిచి యిమ్మయిన దో ♦ నెలుఁగఁ జేసికొన హి
మాలయప్రాంత మ ♦ హాటవులను
శీతకాలమున వీ ♦ చెడిగాలులకుఁ గూలి
వఱదలచేఁ బొంగి ♦ పొరలి పాఱు

చున్న సింధునదిఁ ద ♦ దుపనదులఁ గుప్ప
తెప్పలుగాఁ బైకిఁ ♦ దేలి రాఁగ
జాలరుల్ వట్టు వృ ♦ క్షప్రకాండంబుల
కరణి గొప్పదియునై ♦ మొరటుదైన
చెట్టు మొదలొండు నిరుకేలఁ ♦ బట్టి రుస్తు
మంత నోరులెత్తఁజాలని ♦ యాకడింది
గుదియపై కెత్తి తన శక్తి ♦ కొలఁది వ్రేసె
నశని పాతముఁబోలు ప్ర ♦ హార మొకటి. 113

గీ. కాని సోహ్రాబు మగుడఁ బ్ర ♦ క్కకుఁ దొలంగి
గుదియ వ్రేటును దప్పించు ♦ కొనఁగ నేలఁ
బిడుగువలె వ్రోఁగె నది ; పట్టు ♦ సడలి గదయుఁ
దొరలుచుం గ్రింద వడియె రు ♦ స్తుముని వ్రోల. 114

ఆ. వ్రేటు వడికి మోక ♦ టిలెఁ దూలి రుస్తుము
గూడ ; జేతులిసుకఁ ♦ గూరుకొనియె ;
మోము తనువు ధూళి ♦ గ్రుంగె; దిగ్భ్రమజెంది
యతఁడు కొంతవఱకు ♦ నటులె యుండె. 115

ఉ. అత్తఱి సోహ్రాబేమియుఁ బ్ర ♦ యాసము లేకయె కత్తిదూసి యా
యుత్తమ వీరునిన్ బొడిచి ♦ యుండిన నుండఁగ వచ్చుఁగాని తాఁ
గత్తిని దూయకే యతనిఁ ♦ గాంచుచు మోమున లేఁత నవ్వు రే
కెత్తఁ బిఱిందికిన్ మరలి ♦ యిట్లనె నాతనికిన్ మృదూక్తులన్. 116

క. “ఏలా మోదెద వీ విటు
నేలను వ్యర్థముగఁ ? దుత్తు ♦ నియలో గదయున్ ;
లే లెమ్ము ; కినుక విడువం
బోలును ; నినుఁగన్నఁ గనలు ♦ వొడమదు నాకున్. 117

క. "నే నడిగిన రుస్తుము నేఁ
గానంచుం జెప్పి తల్లి ♦ కాని ; మ్మిటునా
మానసమునఁ బ్రీతియు నెం
తే నాసయుఁ గొలుపఁజాలు ♦ నీవెవఁడ విఁకన్ ? 118

ఉ. "కొండికవాఁడనయ్యు నొక ♦ కొన్నిదురంబుల నే నెఱుంగుదున్ ;
వెండియు నందు వాఁగు మొన ♦ నిల్చియె నిచ్చలు విక్రమించితిన్
జెండితి మార్తురన్ హతులు ♦ చేడ్పడుచుండుట గంటిగాని యె
న్నండిటు స్నిగ్ధభావమున ♦ నామది పొల్చుటలేదు వింటివే ? 119

క. "వేయునేల ? నేఁడు ♦ నీ యందు నామది
దవిలియుండు టరయ ♦ దైవ కృత
వమ్మె నిశ్చయముగ ; ♦ సమ్మదమున విధి
కియ్య కొనక తీఱ ♦ దింక మనకు. 120

క. "రమ్ము ; మనకుఁబొందే యుచి
తమ్మగు; నెడనుంచి యూయు ♦ ధముల సఖుల చం
దమ్మునఁ గూర్చుండుద మీ
విమ్ముగ రుస్తుముని గూర్చి ♦ యే నొడువు దిఁకన్. 121

గీ. "కలరు మీ సేనలోనఁ బెక్కండ్రు నేను
బవర మొనరింతునేని యో ♦ పఁగల బంటు ;
లటులె మాలోనఁగూడ శూ ♦ రాగ్రగణ్యు
లింక నున్నారు నిన్నల ♦ యింపఁగలరు. 122

గీ. "వార లెవరేని నినుఁదాఁక ♦ వత్తురేనిఁ
గదన మీ వొనరింపుము ♦ గాని మన మిఁ
కొండొరుల మిట్లు పోరాడు ♦ టుఱవు కాదు ;
మిత్రులము సుమ్ము; మన కెప్డు ♦ మైత్రివలయు. 123

సీ. అని మిన్నకుండుట ♦ యును రుస్తు మాగ్రహా
వివశుఁడై మేను గం ♦ పిల్లుచుండ
దిగ్గన లేచి గు ♦ దియనక్లె నేలను
విడిచి తళుక్కని ♦ వేఁగుఁ జుక్క
పోల్కి మెఱయువాఁడి ♦ మొనగల తన బల్లె
మును గేల మగుడఁ జే ♦ కొనియె సరగఁ;
తనదు నూతన శిర ♦ స్త్రము ధూళిమయ మయ్యె;
నిసుక దూఁకొనియె నొ ♦ క్కింత నోఁట;

నలపుచే గుండియలు చాల ♦ యదరఁ జొచ్చె;
గొంతు తడియాఱెఁ బోమాట ♦ గూడ నమిత
రోషమున నినుమాఱు ని ♦ రుద్ధమయ్యెఁ;
దుదకు శ్రమమళ్ళి యిట్లనఁ ♦ దొడఁగె నతఁడు. 124

ఆ. "ఆటవెలఁది! యెవరు ♦ హార్షింతు రిచట నీ
యాట నేర్పు నీదు ♦ మాట నేర్పు?
చేతనైనఁ గలను ♦ సేయుము గాని వాఁ
గంగ వలవ; దేవ ♦ గలుగు నాకు. 125

క. "ఇపుడేమొ నీవు తార్తా
రు పసుచులంగూడి క్రేళ్లు ♦ ఱుకుచుందమి మీ
నృపుని నగరమ్ము నందలి
యుపవనముల నుంటి వనుచు ♦ నూహించెదవో? 126

క. "నీ విప్పుడుంటి వాక్ససు
శైవలి నీ తీరమందు ♦ నమరావనిపై;
నీవలె నాకని యనఁ గే
విషయము గాదు; పోరు ♦ లెస్స యొనర్తుఁ. 127

క. "స్నేహితుల మంట! పొందఁట!
యాహా! చిత్రముగ నున్న; దవుడె మఱచితో
నీ హుంకృతులును గడిమియు?
నాహృదయం బిట్టి వంచ నకు లోనగునే? 128

క. "నినుఁజూచిన తోడనె క
ల్గిన జాలియు నిపుడు నాకు లేే; దిరు మొనలున్
గనుచుండ నీవు ననుఁ జు
ల్కన చేసితి విట్లు నలిపి కైలాటములన్." 129

క. అని మిన్నకుండ సోహ్రాబు
గనలుచుఁ దన కత్తిదూసెఁ; గవిసి రనిఁకిఁ దో
డనె యిరువురు నొక రొకనే
కని వచ్చెడి రావులుంగు కవ చందమునన్. 130

గీ. డీకొనఁగ జొచ్చె వారి కేడెములు మిగుల
రవళితో; మ్రోఁగె నపుడుకి రాతు లటవిఁ
దరులఁ గూల్చెడి వేళఁబొదలు కుఠార
ఘాతములఁబోలు భీమ సంఘాతము లొగి. 131

చ. అటువలెఁ దండ్రియుం గొమరుఁ డద్భుతలీలఁ బెనంగ మేఘము మొ
క్కటి జనియించి మింట రవిఁ గప్పవడిన్ సుడిగాలిమై రజః
పటలము రేఁగి దట్టముగ వారల నిర్భర నావరింపఁ జీఁ
కటి మొయిలాము కొన్నగతి గన్పడె వారికి మాత్రమత్తఱిన్. 132

ఆ. ఏమియన్న సేన లెక్కటి కయ్యము
గనుచు నున్నచోటఁ గాసె నెండ;
నింగి దోఁచె మిగుల నిర్మలత్వమున; నా
కసు స్రవంతిపై మెఱసెఁ దపనుఁడు. 133

ఆ. కాని యాతిమిరము ♦ లోనఁ బెనంగిరి
బంటు లిర్వురపుడు ♦ వాఁడి చూపు
లడర నూర్పు లులియ ♦ నతిరోషమును బంత
మును మనమ్ములందు ♦ బెనఁగొనంగ. 134

క. తొలి రుస్తు మీఁదెఁబఱపుడు
నల సోహ్రాబుచేత నున్న ♦ యరిగిన డూయం
గలిగి యట నాటుకొనఁ గ
ట్టలుకఁ జెలుకుకొనియె దాని ♦ నాతఁడు మరల౯. 135

గీ. సోహ్రాబ త్తఱిఁ గడగి రు ♦ స్తుముని శీర్ష
కమ్ముపైఁ దనయసితోడఁ ♦ గడిఁది వ్రేటు
వ్రేయ నదియంత యొకయింత ♦ వ్రీలె; గాని
యచటి క్రొత్తతురాయి ను ♦ గ్గగుచుఁ ద్రెళ్లె. 136

ఆ. అపుడు రుస్తుము తన ♦ యాదలవంచె; జీఁ
కటి మొయిలు మఱింత ♦ కాఁకొనియె;
మింటమ్రోసె నుఱుము; ♦ మెఱుములు దోఁచె; హే
షించె నతని వాజి ♦ చెంత నిలిచి. 137

చ. అది హయహేషితం బనఁగ ♦ నౌనె? కిరాత ధనుర్విముక్త బా
ణదళితపార్శ్వమైన హరి ♦ నట్టడవి౯ మృతిఁబొందువేళ బి
ట్టదరద్రుమమ్ము లంతికగు ♦ హల్ మఱుమ్రోయఁగ గండశైలముల్
ప్రిదిలి పడంగ సల్పు నతి ♦ భీకర గర్జయు దాని కూనమా. 138

క. ఇరుమొనల వారు నా భీ
కర గర్జన మాలకించి ♦ కంపిల్లఁ దొడం
గిరి; తత్స్పర్శన కాక్స
స్సరిదంబువు పేరుకొన్న ♦ చందము తోఁచె౯. 139

క. కాని యొకింతయు సోహ్రాబు
దానికి వెఱువక మరల న ♦ తని ఖడ్గముతోఁ
దానింకొక పరి గొట్టఁగ
నా నిహతికి మగుడ రుస్తు ♦ మాదల వంచెన్. 140

గీ. ఇప్పటికి గాజువలెఁ దన ♦ హేతి వేయి
వ్రక్కలై త్రుళ్ళె; జలజల ♦ రాలె శీర్ష
కమ్ముపైనుండి తునుకలు; ♦ కాని దాని
మేటి పిడియొండె తనచేత ♦ మిగిలియుండె. 141

గీ. రుస్తు మప్పుడు తలయెత్తి ♦ రోషతామ్ర
న యనుఁడై చూపఱకు వింత ♦ భయము గొల్పు
నట్టి నిజశక్తి జళిపించి ♦ యాతఁడట్టె
కెరలి "రుస్తు" మ్మనుచు నొక ♦ కేక వైచె. 142

క. ఆ కేక పిడుగువలెఁ జెవి
సోఁకఁగ విస్మయము నొంది ♦ సోహ్రాబు చనుచున్
దేఁకువమై బిఱిఁదికి భయ
దాకృతి రుస్తుముని విగ్ర ♦ హము గనఁజొచ్చెన్. 143

గీ. పదపడి యతండటులె ఱిచ్చ ♦ వడిన భంగి
నిలువఁ దనచేత నుండిన ♦ ఫలక మపుడు
జాఱిపడుటయుఁ గ్రింద త ♦ త్క్షణము తనదు
బల్లెమును రుస్తు మతని పా ♦ ర్శ్వమున గ్రుచ్చె. 144

క. తోడన సోహ్రాబు కడు దూఁ
గాడుచు నిట్టట్టు తప్పు ♦ టడుగులతో నా
వాఁడియగు సత్తిమై గ్రే
లాడుచు నుండంగ వెనుక ♦ కరుగుచుఁ ద్రెళ్ళెన్. 145

ఆ. శీర్ణమయ్యె నంతఁ ♦ జీఁకటి; గాలి శ
మించె; నింగి నడుమ ♦ మిహిరుఁ డట్టె
తోఁచి యొయ్యఁ దొలఁగఁ ♦ ద్రోసె నువ్వెత్తుగ
నపుడు క్రమ్మియున్న ♦ యట్టి మొయిలు. 146

క. అత్తఱిఁ గనె నిరు పవుజులు
హత్తిన వేడ్క నిలుచున్న ♦ యల రుస్తుముఁ గ్రొ
న్నెత్తుటి వఱదలచేఁ గడు
జొత్తిల్లిన యిసుక నేల ♦ సోహ్రాబు నొకటన్. 147

సీ. అంత రుస్తుము వాని ♦ నపహసించుచు నిట్టు
లనఁ జొచ్చె, "నేఁడు సో♦హ్రాబ! నిజముగ
నొక పారసీక ప్ర♦భూత్తముఁ గడపి నీ
వాతని మైనఱు ♦ వ పహరించు
టో యొండెనల రుస్తు ♦ మే యుద్ధ మొనరింపఁ
జనుదెంచి నీ జాణ ♦ తనము మెచ్చి
తానాల మొనరింప ♦ కే నీవలన గాన్క
యేదేనిఁ గొని పోవ ♦ నిచ్చిన నిను

నీ పరాక్రాంతియును మాట ♦ నేర్పు వేయి
నోళ్ళఁ బొగడుచుఁ దార్తారు ♦ లెల్ల నుండ
వించు నుప్పొంగుటో సంభ ♦ వించు నంచు
నూహ నీ వొనరించి యే ♦ యుందు వకట! 148

క. "పామరుఁడ! నేఁడు నీ వొక
సామాన్యపు భటునిచేతఁ ♦ జచ్చితి; వీఁకనిన్
బ్రేమించు నెంతయే ని
చ్ఛో మెలఁగు సృగాలకోటి ♦ చోద్యపు సఖులై." 149

చ. అన నలవోక సోత్ప్రహాబవు ♦ డాతని కిట్లను, "నీవు కీరితిం
గననిభటుండవే నిజము; ♦ కాని పరాక్రమ మొప్ప నీవె నన్
దు నిమితి షన్నమాట మృష; ♦ దుర్జయుఁడు జ్వాలమూర్తి యున్న మే
న నుఁదునుమాడె; గన్మొఱఁగె ♦ నా హృదయంబె నన్నుఁ ద్విషద్గతిన్.

గీ. "ఇట్లు కాకున్నచో భవా ♦ దృశులు పదుగు
రెత్తి వచ్చిన నొక్కఁడ ♦ నే కడంగి
పోరి తిన యేని ద్రెళ్ళరె ♦ వార లిచట?
నిలిచియుండనె నీవలె ♦ నేను నచట? 151

ఉ. "కాని తదాఖ్య విహ్వలుని ♦ గాననుఁ జేసె; నదేమొ కాని నా
మానసమున్ జలించెఁ బలు ♦ మాఱు భవన్ముఖ వీక్షణం బిటుల్
నే నొనరింప; నంత నుర ♦ లెన్ భువి నా ఫలకంబు; నీవు బిం
కాన నిరాయుధున్ బొడువఁ ♦ గల్గితి వప్పుడు మేటి బంటవై. 152

చ. "వలదు ప్రగల్భముల్ పలుక; ♦ వారని నావిధి నీవు దూఱఁగా
వలవదు; కాని నమ్ముమిది: ♦ వంచనచేఁ దన పుత్త్రుఁ జంపి నం
దులకిఁక నేఁడొ ఱేపొ నిను ♦ ద్రుంచెడి నా జనకుండు నుస్తు; మీ
వల జగదేక వీరుని మ ♦ హోగ్రహవహ్నికి నిల్వ నేర్తువే? 153

గీ. "ఏ మహాత్మునికై జగ ♦ మెల్ల నేను
నెమకుచుంటినో యట్టి యు ♦ స్తుము మదీయ
జనకుఁ డసుదెంచి కసిదీఱ ♦ జెనకి నిన్ను
నీదు పీచమడంచుట ♦ నిశ్చయంబు." 154

సీ. ఆస్థన్ మృగయుఁ డొక్క ♦ యటవి చెంగటి కొండ
చఱియపై నెలమిఁ బూఁ ♦ దఱిని గూడు
తాఁ గట్టుకొని చిఱు ♦ తను లెస్సగాఁ జేరు
కొనియున్న రాపుల్గుఁ ♦ గోల దూయ

నేసిన నది దూర ♦ మెగసి కొండొక చక్కఁ
గూలు టెఱుంగక ♦ డాల దాని
జోడొంటి శిశువుంటఁ ♦ జూచి తివ్వన వచ్చి
ప్రియురాలిపైని గో ♦ పించిన గతిఁ
గూయుచుఁ గులాయమును వల ♦ గొనుచు దన మ
హాపదను సుంతయు నెఱుంగ ♦ నటులె రుస్తు
మాత్మ నష్టమెఱుఁగ కాగ్ర ♦ హామతి నిలిచి
యుండెఁ జానున్న నిజతన ♦ యుని కెదురుగ. 155

క. వెండియు నతఁడిట్లను, "జన
కుండఁట! నాపైని దీఱ్చు ♦ కొనునఁట కసి! యీ
తండేల ప్రేలునిటు? కొమ
రుండెక్కడఁ? జిత్రమయ్యె ♦ రుస్తుమున కిలన్?" 156

క. అన నతనికి హీన స్వర
మున నిట్లను సోహ్రా, "బవును; ♦ వుత్త్రుఁడు కలఁ డా
తని కొకఁడు; నీవు లేఁడను
కొని యెడి రుస్తుముని కన్న ♦ కొమరుఁడ నేనే. 157

ఉ. "నిక్కము నమ్ము; నే నిటులు ♦ నీల్గిన వార్తను రుస్తు మేడనో
యొక్కఁడు కూరుచుండ నెవఁ ♦ డో వచియించెడు; నప్డు గుండియల్
వ్రక్కలు గాఁగ హా! యనుచు ♦ వంకురి యాతఁడు దూఁకి లేచి నీ
యుక్కడగింప నీయెదుట ♦ నుట్టిపడండె మహోగ్రమూర్తియై? 158

గీ. "వినుము నే నాతనికి నొక్కఁ ♦ డనె సుతుండ;
నింక నెటులుండు నాతని ♦ హృద్వ్యథయును
బగను సాధించు తెఱఁగును? ♦ బ్రతికి యుండుఁ
గాక మా దుఃఖమొకసారి ♦ చూతు గాక! 159

గీ. అయిన నే నాతనిం గూర్చి ♦ యట్టె వగవఁ;
గాని 'ఆదరు బెయిజను' ♦ లోన నున్న
'కుర్దు' లన్నృపోత్తముని కూర్మి ♦ కూఁతు నాదు
తల్లిని దలంచినన్ మది ♦ తల్లడిల్లు. 160

క. "ఆ మందభాగ్య యిఁక సం
గ్రామమ్ములఁ గొల్లగొనిన ♦ ద్రవ్యముతో నే
సేమముగ మరలి వచ్చుట
తామఱి యెన్నఁడును లోల ♦ తన్ జూడదుగా! 161

చ. "సొరిదిగఁ గొన్ని నాళ్ళ కల ♦ సోహ్రబు చచ్చెనటంచు వారు వీ
రఱిముఱి జెప్పఁగొందు; రది ♦ యామె చెవింబడు; నప్పుడామె నే
దురమునఁ బేరులేని యొక ♦ తుచ్ఛునిచే నొక యేటి యొడ్డునన్
మరణముఁ జెందియుంట విని ♦ ప్రాన్పడు; నెంతటి కష్టమయ్యెయో!"

క. అని యూఁడు దానివలెఁ గో
యని యేడువఁ దొడఁగె సోహ్రా ♦ బపుడు తనకుఁ గ
ల్గిన యపమృత్యువు నొక పరి
దన మాత నొకపరి దలఁచి ♦ తల్లడపడుచున్. 163

ఆ. కాని రుస్తుమట్టు ♦ లే నిల్వఁబడియె ని
వ్వెఱఁగుతోడ నతని ♦ వినుచు; మఱియు
నతఁడు తన కుమారుఁ ♦ డని నమ్మఁడయ్యె దా
నెఱిఁగియున్న పేళ్ల ♦ నెంచుచున్న. 164

గీ. ఏలయనఁ దొల్లి "ఆదర్బె ♦ యిజను" లోనఁ
దనకుఁ గల్గిన నిసు వొక్క ♦ త కరమల్ప
రూపిణి కొమార్తగాని పు ♦ త్త్రింపు కాఁడ
టంచు రూఢిగ నతఁ డాల ♦ కించి యుండె. 165

క. జననియె మోహావశత నా
తని కంపె నుదంత మిట్లు ♦ తన చిన్ని కుమా
రుని శస్త్ర శిక్షితునిఁ జే
య నతఁడు వెంటఁగొని పోవు ♦ ననియెడి భీతిన్. 166

గీ. కాన సోహ్రాబె తాను స్వో ♦ త్కర్షమెసఁగ
రుస్తుముని పట్టినంచు వా ♦ క్రుచ్చునిట్టు
లొండె జను లీతని యశము ♦ నూన రీతిఁ
బెనుప నిటు పిల్తు రనుచు భా ♦ వింపఁ దొడఁగె. 167

చ. ఇటు తల పోయుచుండె మది ♦ నెంతయు రుస్తుము మానసాబ్ధిఁ బి
మ్మట తరఁగల్ జనించి పలు ♦ మాఱెదఁ దాఁకెన బౌర్ణమాసి వి
స్ఫుట శశిబింబకాంతి పరి ♦ చుంబిత మూర్ధములై సముద్ర పుం
దటమును "బోర్!" "గుభిల్!" రొదలఁ ♦ దాఁకెను చందము నంద
[రంగముల్.

క. అపుడతనికి దానానం
ద పరవశత తోడమున్న ♦ తాఁ గడపిన ప్రా
యపు దివసము లన్నియు నో
క్కపరి స్మృతికి రాఁగ నీరు ♦ గ్రమ్మెం గనులన్. 169

సీ. తొలుగట్టుకొనఁ బ్రొద్దు ♦ తోఁచెడి వేళఁ గి
రాతుఁ డొక్క గిరి ప్ర ♦ పాతము పయిఁ
బొల్చు తన కుటీర ♦ మున నిల్చి బాల సూ
ర్యా తపనంఛన్న ♦ మై దవిష్ఠ
మైన పురము నొక ♦ దాని నప్పుడె యుర్లు
చున్న మబ్బుల మధ్య ♦ నుండి కనిన
లీలఁ జూచెదన వ ♦ యో లక్ష్మినత; డష్ట
ప్రాయమందున్న సోహ్రాబుని జనని

యామె ముదుసలి తండ్రియు ♦ నాదరు బెయి
జనున వెలసిన యాత్రేని ♦ సదనమును బ్ర
మద వనంబులు నింపారు ♦ మల లోగిఁ బొడ
కట్టె నతనికిఁ గనులకుఁ ♦ గట్టినట్టు. 170

చ. మఱుకువ నాతఁడప్పుడె ప్ర ♦ మాద వశంబునఁ ద్రుంపఁబడ్డ క్రొ
మ్మరువపు మొక్కవోలె నణు ♦ మాత్రము నిమ్మళికే కరమ్ము చూ
పఱకెద జాలిఁగొల్పు నును ♦ బ్రాయము వానిఁ గుమారు నాదట౯
మఱిమొక సారి తేఱి కని ♦ మార్దవ మొప్పగఁబల్కె నీగతి౯. 171

చ. "నను విను మోయి సోహ్రాబ! మ ♦ నమ్మునఁబొంగఁడె రుస్తుమీవె యా
తని తనయుండవైన యెడ? ♦ దారుణ బుద్ధులు కొందఱిట్లు ప
ల్కిన నవు నంచు నమ్మితివొ ♦ లేక యశమ్మునుగోరి నీవె యి
ట్లనువుగఁదెల్పెదో తెలియ; ♦ దాతని పుత్త్రుఁడ వీవుకావు సూ.

గీ. "రుస్తుమున కొక్కఁడైన బు ♦ త్త్రుఁడును లేఁడు;
అతని కొక పుత్త్రియే కల; ♦ దామెయుఁ దన
జనని కడనుండి యిపుడింటి ♦ పనులొనర్చుఁ
గాని తలఁపదు కలనైనఁ ♦ గలను తెఱఁగు." 173

గీ. అన వినియుఁ గాని యతని గా ♦ యంపు బాధ
యప్పటికిఁ దీవ్రమై దుస్స ♦ హముగుచుండెఁ;
గాన నీఁటెను వెలికి బి ♦ రాన నూడఁ
బెఱికి సోహ్రాబు ప్రాణము ♦ విడువఁ దలఁచె. 174

క. కాని యతఁడు మున్నన్నగఁ
దానల రుస్తుముని మేటి ♦ తనయుఁడగుట యె
ట్లైన నతని నమ్మించియె
ప్రాణము విడువంగ నెంచి ♦ యనె నిట్లలుక౯. 175

గీ. "ఏమి! నే బొంకితి ననెద ♦ వే దురాత్మ!
సత్య మెప్పుడు వసియించుఁ ♦ జావ నున్న
వారి జిహ్వాల; మఱి యింత ♦ వఱకుఁ గల్ల
యిట్టిదని కూడ నమ్మ నే ♦ నెఱుఁగఁ జుమ్ము. 176

చ. ఇది విను తొల్లి రుస్తుమని ♦ కేగుచు గర్భవతిన్ మదంబ నో
ప్పిదముగఁ బిల్చి తాఁ గనెడి ♦ బిడ్డకు వేయు మటంచుఁ జెప్పి చి
న్నది యొక ముద్ర నిచ్చెనఁట; ♦ నా భుజ సీమఁదదీయ చిహ్నమే
పొదలెడు నిప్డు; చూచెదవె ♦ పూర్తిగ నమ్మిక గల్గు నట్లుగన్?

చ. అనుటయు మోము వెల్లఁబడె ♦ నా ముదిబంటున; కూఁగె జానువుల్;
తనువు వణంకఁ జొచ్చె; నెడఁ ♦ దన్ గడుభారము దోఁచె; రుస్తుమొ
య్యనఁ దన మేటి కేలు గవ ♦ నక్కునఁ జేఱిచి నిశ్వసించి యి
ట్లనె నుడికొంకుపోవ మన ♦ మాతురతన్ దొలుకాడు చుండఁగన్.

గీ. "అవును సోహ్రాబ! నీవని ♦ నది ప్రబల ని
దర్శనమె సుమ్ము; నీ విప్డు ♦ దాని నాకుఁ
జూపితివ యేని నీవు రు ♦ స్తుముని సుతుఁడ
వంచు నమ్మెద; నిఁక సంశ ♦ యమ్ము లేదు." 179

క. అన విని వడివడి సోహ్రాబు
తన దట్టి నడల్చి శ్రేష్ఠ ♦ తర సింధూర
మ్మును గూర్చి యిడిన లక్షణ
మును జూపఁగఁ దనదు బాహు ♦ వును వెలు వఱచెన్. 180

సీ. పేరు గాంచిన చిత్ర ♦ కారుఁ డుత్సుకతఁ జీ
నా దేశవుం బ్రధా ♦ నాధికారి
యెదుట నజరు వెట్ట ♦ నెంచిన నీటు పిం
గాణి పాత్రపయిఁ జొ ♦ క్కంపుఁ జెంది

రముతోఁడ వేఁకువ ♦ సమయానఁ బవలెల్ల
సంజప్రొద్దున రేయి ♦ సన్నదివ్వె
కడ శ్రద్ధమై బాటు ♦ పడి చిత్రతర చిత్ర
ములనెంత సున్నిత ♦ ముగ రచించు
నంత సున్నితముగ నిడి ♦ నట్లు తోఁచె
సోహ్రాబుని బాహువునకు వింత ♦ సొగసుఁ గూర్చు
నని యనందగు నల రుస్తు ♦ ముని స్వకీయ
సూక్ష్మతర చారు ముద్రికా ♦ లక్ష్మమువుడు. 181

ఆ. సోహ్రాబప్పుడు పరి ♦ శోధించెఁ దల్లక్ష
ణమును గొంత సేవు ♦ నయన యుగళిఁ
జింతదోఁప; బిదపఁ ♦ జెయిసాఁచి దాని సం
టుచుఁ గడంక దాని ♦ టులు వచించె. 182

క. "ఇఁక నైన నేను రుస్తుము
ని కుమారుఁడ నంచు మదిని ♦ నీ కొదవెనె స
మ్మిక? లేక యీ గుఱుతు వే
ఱొకని కుమారునికిఁ గూడ ♦ నొప్పు ననెదవో?" 183

గీ. అని విరసభావ మొప్పఁగ ♦ నతఁడు పలికెఁ;
గాని రుస్తు మతని నట్టె ♦ కనుచు మ్రోడు
పడినటులు నిల్వఁబడి కొంత ♦ వడికి "హా! కు
మార! నీ తండ్రి" నను మాట ♦ మాత్ర మనియె. 184

ఆ. ఏమియన్నఁ గార్మొ ♦ యిలొకండపుడు వాని
కన్నుదోయి నాము ♦ కవియు చుండె;
స్మృతి యడఁగె; బరిభ్ర ♦ మించె శిరము; మెయిఁ
దూలె; రుస్తు మంత ♦ నేలఁగూలె. 185

చ. అదిగని సోహ్రాబాత్రమున ◆ నాతని చెంతకుఁ బ్రాఁకి పోయి యా
ముది జగజెట్టి బాహుయుగ ◆ ముం దన గ్రీవమునందుఁ జేర్చి చెన్
బెదవిని ముద్దిడెన్ నిమిరె ◆ వేమఱు వానికపోలపాళిఁ బె
ల్లిదమగు ప్రేమచే మెయిచ◆లింపఁగ నాతనిఁ దేఱ్పఁ జూచుచున్. 186

క. స్మృతి రాఁగఁ గొంత తడవున
కతఁడు గనులు విచ్చి చూచె; ◆ నపుడతని మదిన్
మితి మీఱి తెరలుచుండిన
వెత సైఁపఁగఁజాల కతఁడు ◆ వీఱిడి వోలెన్. 187

ఆ. చుట్టునున్న యాయి ◆ సుమును దోసిట నెత్తి
యట్టె పోసికొనియె ◆ నొదల వయి
మోము పైని మేనఁ ◆ బూనిన కవచాయు
ధములపై నతండు ◆ దళము గాఁగ. 188

ఆ. అమితశోక వివశుఁ ◆ డై బిట్టు మూల్గుచు
నుండ నప్పుడతని ◆ గుండె లదరఁ
జొచ్చె; బాష్పజలమి ◆ సుకఁ జాలఁగలసి వే
రుకొనఁజేసె; నుడి ని ◆ రుద్ధమయ్యె. 189

క. అత్తఱి దూసి యతఁడు తన
కత్తిని వే యాత్మహత్య ◆ గావించుట కా
యత్తుఁడగు టెఱిఁగి సోహ్రాబు
తత్తఱ వాని చెయి నూఁది ◆ తానిటు వల్కెన్. 190

గీ. “తాళు తాళుము జనక! నీ ◆ మూలముననె
నాకు నేఁటికి దుర్మర ◆ ణంబు కల్గు
నంచు నా నొసటం దొల్లి ◆ యజుఁడు వ్రాసె;
నదియె నేఁడయ్యెఁ; గానఁ ద ◆ గదిటు వగవ. 191

క. "నినుఁగన్న తోడనే నా
జనకుఁడ వీవంచు మదిని ♦ సంబ్రమపడితి; నీ
వును నన్నుఁజూచి నీ కొమ
రునిగాఁ దలఁచితివి; నే నె ♦ ఱుంగుదు నదియున్. 192

గీ. "కాని హతవిధి మనలకుఁ ♦ గపట వృత్తి
గొలిపి యొదవించె నీ పాదు ♦ కలను; మఱియు
నన్ను జగదేక శూరుఁడో ♦ నా జనకుని
కోపబడబానలంబునఁ ♦ గూలఁ ద్రోసె. 193

క. "మన మిఁక దీనిం గూరిచి
వనరఁ జనదు; నాయదృష్ట ♦ వశమునఁ దుదకుం
గనుఁగొంటి నా జనకు; నా
కనుల కఱవు దీఱె; కౌతు ♦ కం బొదవె మదిన్. 194

గీ. "రమ్ము; నా యండఁ గూర్చుండు; ♦ మిమ్ము మెయి మ
దీయ శిరమును నీ కయి ♦ దోయి నెత్తి
ముద్దుఁగొను వేగ నాదు క ♦ పోలపాళి;
పిలువు నను "బుత్రకా!" యని ♦ ప్రేమ గదుర. 195

చ. "తడవొనరింపరాదు; మృతి ♦ దాఁపగుచున్నది సుమ్మునాకు; నే
వడివడిఁ గ్రొమ్మెఱుంగు గతి ♦ వచ్చితి నీరణ సీమ; కిప్డు నే
వెడలుచునుంటిఁ బైపయిగ ♦ వీచెడిగాలి వితాన; నింత కీ
వసువున బ్రహ్మనా నొసట ♦ వ్రాసె; నదెట్టులు తప్పు నాకికన్?"

క. అని మిన్న కుండుటయు బో
రున నేడువఁ దొడఁగె నపుడు ♦ రుస్తుము నెమ్మిం
దన బాహులతని గ్రీవ
మ్మునఁ జేర్చి గండ పాళి ♦ ముద్దుం గొనుచున్. 197

ఆ. రుస్తు మీా విధమున ♦ రోదన మొనరింపఁ
జూచి "హా! యిదేమి ♦ చోద్య?" మనుచు
రెండు సైన్యములును ♦ ఆచ్చ్వడిన భంగి
నిలిచి యుండె నవుడు ♦ నివ్వెఱమెయి. 198

చ. బిఱబిఱ వచ్చి రుస్తుముని ♦ పెంపుడు గుఱ్ఱము వారి చెంత క
త్తఱిఁ దన మేటి జూలు భువిఁ ♦ దాఁకఁగ వారల దుఃఖకారణ
మ్మరసెడు భంగి నూఁపుఁ దన ♦ యాదల నిట్టటు; వేఁడి బాష్పముల్
విరివిగ రాల్చెఁబో యిసుక ♦ పేరు కొనంగఁ దదశ్రుసిక్తమై. 199

గీ. దానిఁగని రుస్తు, "మోసి సైం♦ధవమ! యిప్పు
డేల శోకింతు వయ్యయో! ♦ యీ రణావ
నికి మొదట ననుఁదోడితే ♦ రకయె నీవు
చచ్చితివి కావు; వగపేల? ♦ చాలుఁజాలు." 200

ఆ. అనుచు నాహయమ్ము ♦ నాతఁడు గద్దింపఁ
జూచి యాస దోలుక ♦ సోహ్రాబిట్టు
లనియెఁ, "దెలిసె; నీవు ♦ పెనిచినట్టు ప్రసిద్ధిఁ
గన్నతురగ మిదియ ♦ కాదె? తండ్రి! 201

ఉ. "బీరమె రూపమొంది ప్రభ ♦ వించె నోశ్రోయన నొప్పుదీవు; నిఁ
గూరిచి చెప్పె నాజనని ♦ గొప్పగ నెన్నియొ మాటలింక నో
సార తురంగమా! మిగుల ♦ సార్థకమయ్యె మదీయ జన్మమీా
తీరున నిన్ను నాజనకుఁ ♦ దృప్తిగ నొక్కటఁ జూడఁగల్గుటన్. 202

క. "రా రమ్మిచటికి; నీదు శ
రీరము నొకసారి చేత ♦ స్పృశియించెద నో
వారువమా! నీకేల వి
చారము? నా కంటె భాగ్య ♦ శాలివి గావో? 203

గీ. “ఏమనందువా యింక నే ♦ నెన్నఁడరుగఁ
బోవ నట్టి స్థలంబుల ♦ కీవు పోవఁ
జాలితివి కాదె? నా పితృ ♦ సదన మీవు
చూడ లేదో కో? నేఁ దానిఁ ♦ జూడఁగలనె? 204

సీ. “ ‘సీస్టన్’ ప్రదేశవు ♦ సికతామ యమ్మగు
నట్టి భూముల నీవు ♦ మెట్టినావు
‘హెల్మండ్’ తరంగిణీ ♦ కల్మషరహిత నీ
రము నీవు పలుమాఱు ♦ త్రావినావు
నేత్ర పర్వముగ నె ♦ న్నియొ సార్లు నీ వల
‘జిఱ్ఱా’ సరసును వీ ♦ క్షించి నావు
పిలిచి ప్రీతిగఁ బైడి ♦ తళియతో నా తాత
మేఁతఁ బెట్టఁగ నీవు ♦ మెసవి నావు

కాని నాకెట్టి భాగ్యముం ♦ గలుగ దయ్యెఁ;
దాత నే నెన్నఁడెఱుఁగ; నా ♦ తని విశాల
సదనమును జూడ లేదు సీ ♦ స్టనున; దప్పిఁ
దీర్చికొన లేదు హెల్మండ్ న ♦ దీ జలముల. 205

క. “ఎఱుఁగక తొలి నా జనకుని
యరివర్గమునందుఁ జేరి ♦ యని సల్పుచు ‘స
మ్మరఖండ్’ ‘బొఖరా’ ‘ఖైవా’
పురముల ‘టర్క్మన్’ గుడార ♦ ములనే కంటిన్. 206

క. “వెండియుఁ జూచితి నదుల ‘తె
జెండు’ ను ‘మూర్ఘాబ్’ ‘కొహీకు’ ♦ ‘సీర్’ ‘ఆక్ససులన్;
నిండుకొని యిపుడు పాఱుచు
నుండిన యీ యాక్ససుదరి ♦ నుసురు విడిచెదన్.” 207

క. అనిన విని బిట్టు మూల్గుచు
నని రుస్తుము, "ఘాతుకుండ ♦ నాక్సనుతటినీ !
నను ముంచి వేయు మిఁక బు
త్రుని నీఁ జంపిన బాధ దొలఁగఁ ♦ ద్రోయుము వేగన్." 208

క. అనుటయు సోహ్రాబు వానిం
గని యిట్లను "నీవు కోరఁ ♦ గారాదు మృతిన్
జనయిత! తప్పక నీ విం
కను జీవింపుము వు కీర్తి ♦ కాంతా పతివై. 209

ఆ. "ఏమి యున్నఁ గొంద ♦ ఱెంతయు ఘనకార్య
ముల నొనర్చుచు భువిఁ ♦ బొదలు చుంద్రు;
కొందఱూరు పేరు ♦ గూడ లేకయె మని
మృతినిఁ బొంద జన్మ ♦ మెత్తు చుంద్రు. 210

క. "కావున నే జీవించినఁ
గావింతు ననుకొని నట్టి ♦ ఘన కార్యంబుల్
నీ వొనరింపవలయు; నా
కై వెండియుఁ గీర్తి నీవు ♦ గడియింపవలెన్. 211

ఆ. "నా జనకుఁడ వీవు; ♦ నాదె పోసీమహా
యశము వైభవంబు; ♦ నైన నేమి?
నన్నె నమ్ముకొనుచు ♦ నా వెంట వచ్చిన
యాచముఖును నీవు ♦ చూచి నావె? 212

ఉ. "వారికి నేనె పెద్దనయి ♦ వచ్చితిఁ; గావున వేఁడి కొందు ని
ష్కారణ మీవు వారలను ♦ జంపకు; మేమి యొనర్చి రింతకున్
వారలు నీకు? నాయశము ♦ నా భుజశక్తిని నమ్మినారు సూ;
వారల నెల్లనాక్సను ప్ర ♦ వంతిని దాటఁగ నిమ్ము నెమ్మదిన్.

సీ. "నను నీస్తనున కీవు ♦ గొని పొమ్ము; వారితోఁ
బంపకు; మట నొక ♦ పాన్పుపైని
నాదేహమును వైచి ♦ ప్రోదిమై నీవును
నీ మిత్రులును నాపి ♦ తామహుఁడును
నామృతికై వ్యస ♦ నము నొందుఁడొకట; బ
దంపడి యొక పవి ♦ త్రస్థలమున
ననుఁబూడ్చి మేటి తీ ♦ నె నొకండు మఱి దాని
పై నున్నతమగు కం ♦ బము రచింపు;

మటు లొనర్చిన దవులనె ♦ యధ్వగు లొగిఁ
జూచి దానిని, 'మేటి రు ♦ స్తుముని సుతుని
సోహ్రాబును బూడ్చి రచ్చోట; ♦ సుతు నెఱుఁగక
జనకుఁడే చంపె' నని చెప్పు ♦ కొని చనెదరు." 214

చ. అన విని రుస్తు మిట్టులను, ♦ "నట్లె యొనర్చెద సుమ్ము పుత్త్ర! చి
వ్వున నిఁక నాగుడారునకుఁ ♦ బోయెద; దానినిఁ గాల్చివైతు; నా
కని పనియేమి యింక? విడ ♦ నాడెద నీ శిబిరమ్ము నిప్డె; నీ
స్తనునకు నేనె పోనిను హు ♦ టాహుటిమైఁ గొనిపోదు వింటివే?

సీ. "నిను నీస్తనునకు నేఁ ♦ గొని పోదు; వారితోఁ
బంప; నచట నొక ♦ పాన్పుపైని
నీ దేహమును వైతు; ♦ బ్రోదిమై నేనును
నా మిత్రులును నీపి ♦ తామహుఁడును
నీ మృతికై కడుఁ ♦ విలపింతు మొకట; బ
దంపడి యొక పవి ♦ త్రస్థలమున
నినుఁ బూడ్చి మేటి తీ ♦ నియ నొండు మఱి దాని
పై నున్నతమగు కం ♦ బము రచింతు;

నీవు మృత జీవుఁడవె యింక ♦ నెట్టులైన;
మఱియు నీ సైన్యమును బరి ♦ మార్పఁ జుమ్ము;
వార లెల్లరు నాకస్త్ర ♦ వంతి దాట
వచ్చు నెపుడైన; నాకేల ♦ వారి యుబుసు? 216

సీ. "ఇఁక నే నరులఁ జంపి ♦ యేమి సంపాదింతు?
నయ్యయో! తొల్లి నే ♦ నాహవములఁ
ద్రుంచిన యెల్లవా ♦ రును బునర్జీవితు
లగుదురు గాక! ప్ర ♦ త్యర్థికోటి
నేరిని మడఁచి నే ♦ నింతటి సత్కీర్తి
గాంచితినో యట్టి ♦ గాళకులగు
నెఱదంట లిపుడు వ ♦ న్నెయువాసి మెఱయఁ గ
మ్మఱ ధాత్రిఁ బొదలుత! ♦ మఱియు నేను

కరము సామాన్యనరుని మా ♦ దిరిని పొల్చి
యసము మోమెన్నఁ డెఱుఁగని ♦ యసదు బంట
నే యగుదుఁ గాత! యటులైన ♦ నీవు గూడ
బ్రదికి యుండుదువేమొ సో ♦ హ్రాబ! కుమార! 217

సీ. "అటు కానిచో నేనె ♦ హతుఁడనై యిచట న
సృక్సిక్తమైన యీ ♦ యిసుక నేలఁ
ద్రెళ్ళియుండిన నన్నె ♦ ఱిఁగి నీ జనకుని గ
ననుఁగూర్చి నీవె వ ♦ నరుదు గాక!
నీ శక్తినిహతిచే ♦ నే నె మ్రందుదుఁగాక!
నీవు నాచే మర ♦ ణింపకుండ
నను సీస్తనున కీవు ♦ గొని పోవుదువు గాక!
నిన్నిట్లు నేఁ దోడ్కొ ♦ ని చనకుండ

నవుడు నా తండ్రికని, 'పుత్త్రి! ♦ యట్టె నిన్నుఁ
గూర్చి శోకింప; నీ విట్లు ♦ గుదువటంచు
నే నెఱుంగుదు' నని యొక ♦ యింత పనవు;
నిపుడు నినుఁజూచి యాతఁడే ♦ శ్చేర్చుఁగాదె? 218

గీ. "ఇంతకును యుద్ధములు జీవ ♦ హింస తప్ప
నన్య మెఱుఁగదు నాదు ప్రా ♦ యమ్ము; వార్ధ
కమున వెండియు నవియె సం ♦ ఘటిలు చుండె;
నింక నా జన్మమునకు ని ♦ ర్వృతియె లేదు." 219

చ. అనవుడు బ్రాణమేదు సను♦యమ్మున నిట్లను సోహ్రబు, "కాను; నీ
జనన మదెట్టిదో మనికి ♦ శాంతియె లేదిపు; డైన నిట్లు నీ
వనఁ జన; దేమియున్నఁ గతి ♦ నాత్ముఁడు మీ నృపుఁడే దినంబునన్
దనువుఁ దొఱంగు నాదినమె♦తప్పక నిర్వృతి నీకుఁ గల్గెడున్." 220

క. నా విని రుస్తుము పొగులుచు,
"నా వాసర మెపుడు వచ్చు? ♦ నంత దనుక నే
జీవించి యుండవలెనే?
హా! విధి కింతటి విరోధి ♦ నైతినె? తనయా!" 221

ఆ. అనుడు సోహ్రబు దర ♦ హాస మొనర్చి పా
ర్శ్వమునఁ జెరివి యున్న ♦ శక్తి నూడఁ
బెఱికె; నంత క్షతము ♦ వెలువడి నది యట్ల
పాఱెనల్ల; పోయెఁ ♦ బ్రాణ మపుడు. 222

సీ. విరి దోఁటలకుఁబోయి ♦ చిఱుతప్రాయపు వాండ్రు
సితపుష్పములను గో ♦ సికొని చెట్ల
నీడలఁజేరి తా ♦ మాడుకొనుచు నుండ
మధ్యాహ్నమగుడు త ♦ మతమ తల్లు

లోగిర విడిచియెద ♦ వేగ రండని పిల్వ
నెచటి పూలచట వి ♦ డిచి పరుగున
నిండ్లకుఁ జనుటయు ♦ నెండతాఁకున కల
తెలి పువ్వులెటు నూత్న ♦ కళలఁ దక్కు

నట్లె యాతని తెల్లని ♦ యంగ మమిత
శోణిత స్రావమునఁ జాల ♦ స్రుక్కి యపుడు
జీవకళఁదక్కియుండె; న ♦ సృగ్ఘరంబు
పార్శ్వమునఁ జింది యెడపక ♦ పాఱుచుండె. 223

సీ. అతని యూదలగ్రుంగె; ♦ నవయువవమ్ముల పటు
త్వము తప్పెఁ; జేష్టలు ♦ దక్కె తనువు
కదుని మీలితమయ్యె ♦ గన్నుదోయియుఁ; గాని
మొగయూర్పు లాతని ♦ కెప్పుడు గల్గె
నపుడొక్క మొగిఁగాయ ♦ మంతయు వణఁకి యా
తనికొక యింత చై ♦ తన్యమొదవ
నతఁడు కన్నులు విచ్చి ♦ యతిదీనగతి జన
కుని మోముపైఁ జూడ్కి ♦ కోరి నిలుపు;

నంత కంతకు మైబిగి ♦ యణఁగు చుండ,
"నెట్టు లీమెలఁ బ్రాయము ♦ నీ మనోహ
రాంగ కమ్మును విడిచెద ♦ నపుడె నే" న
టంచు వగచుచు నతని జీ ♦ వాత్మ చనియె. 224

ఆ. ఈ విధమున సోగ్రహ ♦ బిసుకపై విగతాసుఁ
డగుచుఁ ద్రెళ్ళియుండె; ♦ నపుడు రుస్తు
ము త్తరీయ మట్టి ♦ దొంతు ముసుఁగు వెట్టి
కొడుకు చెంత నటులె ♦ కూరుచుండె. 225

క. అంతట నుర్వీస్థలిపై
సంతమసాభ్రమ్ము జాఱె; ♦ సరగ నలసరి
త్ప్రాంతమునఁ గ్రమ్మెధూమిక ;
యింతింతన రాని సీతు ♦ వెల్లర కొదవెన్. 226

క. వైశమ రేఁగె నపుడు పే
రోలగ మొందు విడిచనెడు ♦ నోజ నులివు; త
త్కాలమ్మున మినుమినుకుచు
వేలకొలఁది మంటలు కను ♦ పించఁ దొడంగెన్. 227

ఆ. ఏమి యన్న నప్పు ♦ డిరువాఁగు తమతమ
శిబిరములను సరవిఁ ♦ జేరుకొనుచు
నుండి; రారగించి ♦ రొక కొంద అప్పుడె;
కొందఱు చలిఁగాచు ♦ కొనిరి బయట. 228

గీ. పారసీకులు మెసవిరా ♦ పగకుఁ గొంత
దూరమున దక్షిణముగ; దా ♦ ర్తారు లేటి
పజ్జనె పసాపడిరి; కాని ♦ వారెవరును
రుస్తుముఁ దలంప రతనిపు ♦ త్త్రునిఁ దలఁపరు. 229

సీ. ఆక్ససు నది మాత్ర ♦ మల్లె పాఱెడు జన్మ
మెత్తి విశ్రృంఖల ♦ వృత్తిఁజాల
కాల మతులిత సౌ ♦ ఖ్యశ్రీ ననుభవించి
పదపడి దొరయు వి ♦ పత్పరంప
రలచేత మిగులఁ గా ♦ ర్శ్యము నొంది యూఱటఁ
గనక తుదకు మృతి ♦ కారణమున
నిహలోక కష్టము ♦ లేద నరుండు శా
శ్వతని ర్వృతిన్ గన్న ♦ పగిదిఁ గొంత

వఱచు స్వేచ్ఛగ నిఱుదల్లి • నోరసి యంత
సైకత శ్రేణి యడ్డురా • సన్న సన్న
పాయలై వక్రగతి నూని • వవధి యనెడి
స్వీయ నిత్య నివాసమ్ము • జేరఁగోరి.




PRINTED AT THE VAIJAYANTI PRESS, MADRAS.

